

# మిఠాయిల మహారాజు కొబ్బరితో గొప్పగా
# కొత్త రకం విందు ఇవ్వాలనుకుంటున్నాడు!









# కోకోనట్ క్రీమ్



PCL. 1831

నోరూరించే కోకోనట్ క్రీమ్.
కొబ్బరితో ఎంతో అద్భుతమైన
సరికొత్త మెత్తని మిఠాయి — అ
రుచికి మరి మీరు తప్పక
లొంగిపోతారు.

<u>నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:</u>

కారమిల్క్ • ట్రై-మా
చాకొలెట్ ఎక్లెయిర్స్
కోకోనట్ పంచ్
చాక్లెయిర్స్ • కోకోనట్ క్రీమ్
లాలీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




**70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో
మొట్టమొదటి పేరు**



"నాకు తెలుసు... చిన్న-చిన్న పళ్ల
రాక్షసులు నా పళ్లలో కన్నాలు చేస్తాయి.

ఎందుకంటే, మా అమ్మ నాకు
విడమర్చి చెప్పిందిగా: అవి నిజంగా
'బ్యాక్టీరియా' అట, అవి నోట్లో
మిగిలిపోయిన అన్నం ముక్కలతో కలిసి
'ఆమ్లాల'ను వూరించి 'పంటి ఎనామిల్'పై
దాడి చేసి కన్నాలు అంటే 'పుప్పిపళ్లు' చేస్తాయి.



కాని నా పళ్లు పాడవవని నాకు తెలుసు.
ఎందుకంటే నా దగ్గర వుందిగా

నా సూపర్ ఫైటర్!

**ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్...**
**దీని సహాయంతో పుప్పిపళ్లతో**
**పోరాడ్తా. గెలిచేస్తా!**






నా సూపర్ ఫైటర్‌లోని ఫ్లోరైడ్
నా 'పంటి ఎనామిల్'ను గట్టి చేసి,
నొప్పి కల్గించే పుప్పిపళ్లు కాకుండా చేస్తుంది.

మా అమ్మ ఎంత మంచిదో. రుచికరమైన, నురుగునిచ్చే
నా సూపర్ ఫైటర్ గురించి నాకంతా నేర్పింది."




ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్
పుప్పిపళ్లను ఎదుర్కొనే సూపర్ ఫైటర్!

429-GM-203 TEL

# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ ["మంచిచెడ్డలు"]కు, ఆధారం, "వసుంధర" రచన. శివుడికి సంబంధించిన కథలను శివలీలలు పేరుతో ప్రచురించాం. శివలీలలు ఈ సంచికతో ముగిసింది. వచ్చే సంచిక నుంచి, ఉత్తరరామాయణం ప్రారంభమవుతుంది.

## అమరవాణి

శనైః పంథాః శనైః కంథా, శనైః పర్వత లంఘనమ్,
శనైర్విద్యా శనైర్విత్తం పంచైతాని శనైః శనైః.

[ఒక్కొక్క అడుగు వేయడంతో ప్రయాణం సాగుతుంది. బొంత తయారు చేయడానికి ఒక్కొక్క కుట్టుగా వేయాలి. పర్వతారోహణ అంచెలంచెలుగానే సాధ్యం. అదే విధంగా, విద్యా, సంపద కూడా క్రమక్రమంగానే సమకూరుతాయి.]


సంపుటి 79 జూలై '86 సంచిక 1

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00







CHITRA

# చందమామ కబుర్లు



## దోమలను తరిమే సంగీతం!

మాంట్రీల్‌లో ఇటీవల ఒక నూతన పరికరం రూపొందించారు. ఈ యంత్రం మీట నొక్కగానే మన చెవులకు ఏ విధమైన సంగీతమూ వినిపించదు. కాని, ఆ యంత్రం నుంచి వెలువడే చిన్న శబ్దం దోమలను దూరంగా తరమగొడుతుంది।



## ప్రపంచ వృద్ధ వనిత

జపానుకు చెందిన 120 సంవత్సరాల వృద్ధుడు మరణించడంతో ప్రస్తుతం బ్రిటన్‌కు చెందిన 112 సంవత్సరాల వృద్ధురాలు ప్రపంచ వృద్ధ వనితగా పరిగణింపబడుతున్నది.



## పుస్తకాలే ఉత్తమం!

ఇటీవలి కాలంలో టెలివిజన్ల ద్వారా విద్యాబోధన ప్రారంభ మయింది. అయినా ఈ శ్రవ్య – దృశ్య సాధనం ద్వారా నేర్చు కునే పాఠాల కన్నా, పుస్తకాల ద్వారా నేర్చుకునే పాఠాలే విద్యార్థు లకు బాగా జ్ఞాపకం ఉంటున్నవని ఒక పరిశోధనలో వెల్లడయింది.



## పళ్లను పట్టే తుపాకీ!

పెట్టెలలోనూ, బంగీలలోనూ దాచి, అక్రమంగా తీసుకుపోయే పళ్లనూ, మొక్కలనూ గురిపెట్టి పట్టుకునే తుపాకులను— అమెరికాలో రూపొందిస్తున్నారు.

పురాణగాథలు :

# కచుడు

దేవదానవులకు చాలా కాలం యుద్ధం జరిగింది. యుద్ధంలో మరణించిన రాక్షసులను, వారి గురువు శుక్రాచార్యుడు మృతసంజీవనీమంత్రంతో మళ్ళీ బ్రతికించసాగాడు. ఆ కారణంగా దేవతలకు రాక్షసులను జయించడం సాధ్యం కాలేదు. అందువల్ల, దేవతలు శుక్రాచార్యుడి నుంచి మృతసంజీవనీమంత్రం నేర్చుకు రమ్మని, దేవ గురువు బృహస్పతి కుమారుడైన కచుణ్ణి పంపారు.

కచుడు శుక్రాచార్యుడి శిష్యుడుగా చేరి, వినయ విధేయతలతో శుశ్రూషలు చేస్తూ, కొంతకాలానికి గురువు ప్రేమకు పాత్రుడయ్యాడు. శుక్రుడి కూతురు దేవయాని కూడా కచుడి పట్ల ప్రేమతో మెలగసాగింది. కచుడు శుక్రుడి శిష్యుడుగా చేరిన ఉద్దేశాన్ని పసిగట్టిన రాక్షసులు, అతన్ని ఎలాగైనా హతమార్చాలని నిశ్చయించుకున్నారు. కచుడొకనాడు అడవిలో హోమధేనువులు కాస్తూండగా, రాక్షసులు అతన్ని చంపి, ఒక చెట్టుకు వేలాడదీశారు. ఆ విషయం తెలుసుకున్న శుక్రాచార్యుడు, మృతసంజీవనీమంత్రంతో కచుణ్ణి బ్రతికించాడు. అయినా రాక్షసులు తమ ప్రయత్నం మానుకోలేదు. వాళ్ళు కచుణ్ణి చంపి, కాల్చి భస్మంచేసి, ఆ భస్మాన్ని పానంలో కలిపి తమ గురువుచేత తాగించారు.

రాక్షసులు చేసిన దురాగతాన్ని, జ్ఞాన దృష్టితో గ్రహించిన శుక్రాచార్యుడు — తన కడుపులో ఉన్న కచుణ్ణి సజీవుణ్ణి చేసి, అతనికి మృత సంజీవనీ మంత్రం ఉపదేశించాడు. కచుడు, శుక్రుడి కడుపు చీల్చుకుని బయటపడి, గురువును మృతసంజీవనీమంత్రంతో పునరుజ్జీవుణ్ణి చేశాడు.

గురువువద్ద సెలవు పుచ్చుకుని బయలుదేరుతూన్న కచునితో, తనను పెళ్ళాడమన్నది దేవయాని.

"నువు గురుపుత్రివి. పైగా మీ తండ్రి ఉదరం నుంచే నేను బయటికి వచ్చాను. నీకు నేను సోదరసమానుణ్ణి. నిన్ను పెళ్ళాడడం ధర్మ విరుద్ధం," అని కచుడు ఆమె కోరికను నిరాకరించాడు.

ఆ మాటలకు ఆగ్రహం చెందిన దేవయాని, "మృతసంజీవనీమంత్రం నీకు ఉపయోగపడకుండా పోవు గాక!" అని శపించింది. ఆ శాపాన్ని అతడు పట్టించుకోలేదు. "నాకు ఉపయోగపడకపోతే పోనీ. నానుంచి ఉపదేశం పొందిన వారికి ఉపయోగపడితే చాలు," అనుకొని కచుడు దేవలోకం చేరాడు.





# గొప్పమనసు

రాయవరం చిన్న గ్రామం. దాన్ని అనుకుని ప్రవహిస్తున్న నదికి పుష్కరాలు వచ్చినై. వారం రోజుల నుంచి జనం ఎక్కడి నుంచో తండోపతండాలుగా వచ్చి, నదిలో స్నానం చేసి వెళుతున్నారు. వారం పది రోజులపాటు గ్రామస్థులకు ఇదొక పెద్ద పండగ.

ఆ సమయంలోనే, గ్రామంలోని చిన్న రైతు దశరథయ్య కూతురు సుమతి పుట్టిన రోజు పండగ వచ్చింది. అతడి భార్య, భర్తను వేగిరపెడుతూ, "చీకటి పడకుండా వచ్చేయండి. దర్జీ యీ సరికి అమ్మాయి పట్టుపరికిణీ కుట్టే వుంటాడు. అమ్మాయిని గుడికి తీసుకుపోవాలి. అసలే ఊరినిండా జనం!" అని హెచ్చరించింది.

అయితే, దశరథయ్య దర్జీ దగ్గిరకు వెళ్ళేసరికి, యింకా పరికిణీ పని పూర్తి కాలేదు. దర్జీ అతణ్ణి కొంతసేపు కూర్చోబెట్టి, పని పూర్తిచేశాడు. అతడు పరికిణీ తీసుకుని బయలుదేరేసరికి చీకటి పడుతున్నది.

దశరథయ్య ఇంటిని సమీపిస్తూండగా, ఒక పాతికేళ్ళ కుర్రాడు పెరటి ద్వారం నుంచి కంగారుగా బయటికి వస్తున్నాడు. దశరథయ్య అతణ్ణి, ఏనాడూ చూసి వుండలేదు.

ఆ కుర్రాడి బెదురు చూపులూ, కంగారూ చూస్తూనే, దశరథయ్యకు వాడు దొంగ అన్న అనుమానం కలిగింది. అతడు పరుగునపోయి, వాడి మెడ పుచ్చుకుని, "నువ్వెవరు? ఇంట్లోంచి ఏం దొంగిలించావు?" అన్నాడు కరుకుగా.

కుర్రాడు బాగా బెదిరిపోయి మాటలు రాక కాస్త తడబడ్డాడు. దశరథయ్య వెంటనే వాడి వీపు మీద చేత్తో గట్టిగా

మాచిరాజు కామేశ్వరరావు

చరిచి. ''దొంగవెధవా, నిజం చెప్పు. దొంగిలించిన వస్తువెక్కడ?'' అంటూ పెద్దగా అరిచాడు.

అది విని, అతడి భార్యా, కూతురే కాక పక్క ఇళ్ళవాళ్ళు కూడా అక్కడికి వచ్చారు.

''ఈ వయసులో కష్టపడి పని చేసుకోక, దొంగతనాలకు దిగాడన్న మాట! నాలుగు తన్ని బుద్ధి చెప్పండి,'' అన్నాడొకడు అక్కడ చేరిన గుంపులో నుంచి.

''ముందు, ఏం కాజేశాడో చూడండి,'' అన్నాడు మరొకడు.

దశరథయ్య వాడి దుస్తులు తడిమి చూశాడు. జేబులో కొంత చిల్లరడబ్బు తప్ప మరేం లేదు.

ఆ కుర్రాడు చేతులు జోడించి, ''నేను దొంగను కాదు. నన్ను వదిలిపెట్టండి,'' అన్నాడు.

''ఈ మధ్య ఎవరో పిల్లల్ని ఎత్తుకుపోతున్నారట. పుష్కరాలు గనక, తేలిగ్గా పిల్లల్ని ఎత్తుకుపోవచ్చని వచ్చివుంటాడు!'' అన్నదొకావిడ.

గుంపులోంచి ఇద్దరు ముందుకు తోసుకువచ్చి, కుర్రవాణ్ణి కొట్టబోయేంతలో వాడు, ''అయ్యా, ఆగండి! ఇంట్లో దేవుడి మందిరం పక్కన వున్న ఎర్ర సంచీ ముందు తీసుకురండి,'' అన్నాడు నిదానంగా.

సుమతి గబగబా ఇంట్లోకి పరిగెత్తి, ఎర్ర సంచీ తీసుకువచ్చింది. దాని నిండా



గలగలలాడుతూ వెండి నాణాలున్నవి. దశరథయ్యకు, ఆ సంచీ తన ఇంట్లోకి ఎలా వచ్చిందో అర్థం కాలేదు.

కుర్రాడు గొంతు సవరించుకుని, ''ఆ సంచీలో వెయ్యి వెండి కాసులున్నవి. ఆ సంచీని మీ ఇంట్లో పెట్టింది, నేనే! ఎందుకు పెట్టానో చెప్పమంటారా?'' అన్నాడు.

దశరథయ్యతోపాటు, అక్కడ చేరిన వాళ్ళందరూ ఆశ్చర్యపోతూ కుర్రాడి కేసి చూశారు. వాడు జరిగిన సంగతి యిలా చెప్పాడు :

పన్నెండు సంవత్సరాల క్రితం వాడికి బాగా జబ్బు చేసింది. వైద్యులు వాడి తండ్రితో, పట్నం తీసుకుపోయి మంచి వైద్యం చేయిస్తేనే గాని, పిల్లవాడు బతకడని చెప్పారు. అయితే, తండ్రి చేతిలో అవసరానికి తగిన డబ్బు లేదు. పొరుగూరిలో అతడి చిన్ననాటి స్నేహితు డొకడున్నాడు. అతడు తప్పక సాయం చేయగలడన్న ఆశతో, ఆయన ఆ ఊరు వెళ్ళాడు.

అయితే, ఆ స్నేహితుడు పుష్కరాల స్నానం కోసం, ఈ ఊరు వచ్చినట్టు తెలిసింది. కుర్రవాడి తండ్రి అక్కడి నుంచి అతడికోసం, ఈ ఊరు వచ్చాడు. కాని, సాయంకాలం వరకూ తిరిగినా, అంతమంది తీర్థప్రజల్లో, ఆయనకు తన స్నేహితుడు కనిపించలేదు.

ఇక చేసేదిలేక తన గ్రామానికి బయలుదేరుతూ, దాహం తీర్చుకునేం





దుకు. ఊరి రచ్చబండకు ఎదురుగా వున్న, మండువా ఇంటికి వెళ్ళి, తలుపు తట్టాడు. ఇంటావిడ తలుపు తెరిచి, అతడికి మంచి నీళ్ళిచ్చి, తిరిగి తలుపు మూసింది.

కుర్రాడి తండ్రి తిరిగి వీధిలోకి రాబోయే సమయంలో, గడప దగ్గిర విలువైనరాయి తాపడం చేసిన ఉంగరం ఒకటి, తళుక్కుమంటూ అతడి కంట బడింది. అతడు దాన్ని తీసుకుని చూసి, తలుపు తట్టి, ఇంటి వాళ్ళకు యిద్దామనుకున్నాడు. కాని, చప్పున తన కొడుకు స్థితి గుర్తుకు రాగా, ఉంగరాన్ని జేబులో వేసుకుని, తన గ్రామం చేరాడు.

అది అమ్మగా వచ్చిన డబ్బుతో, అతడు కొడుక్కు పట్నంలో వైద్యం చేయించి, ఒక్కగానొక్క కొడుకును ప్రాణాపాయం నుంచి కాపాడుకున్నాడు.

కుర్రాడు ఇదంతా చెప్పి, దశరథయ్యతో, "అయ్యా, ఆ తర్వాత, మా నాన్న మీ బాకీ తీర్చేందుకు ఎంతగానో ప్రయత్నించాడు; అయినా సాధ్యపడలేదు. ఐతే, నెల రోజుల క్రితం బాగా జబ్బు చేసి చనిపోయేముందు, మా నాన్న ఈ జరిగినదంతా చెప్పి, తన కర్మకాండకు అట్టే ఖర్చు పెట్టవద్దనీ, ఇంట్లో వున్న ఎనిమిదివందల కాసులకు, మరి రెండువందలు ఎలానైనా చేర్చి, తమకివ్వవలసిందనీ చెప్పాడు. పోయిన మా నాన్నను గురించి, దొంగగా చెప్పడం మనస్కరించక, వెయ్యి వెండి కాసుల్ని రహస్యంగా, తమ ఇంట్లోని దేవుడి గది ముందు పెట్టాను. ఆ డబ్బు తమదే!" అన్నాడు, చేతులు జోడించి నమస్కరిస్తూ.

ఆ కుర్రాడి నిజాయితీ చూసి, అక్కడ చేరినవాళ్ళందరూ ఆశ్చర్యపోయారు.

"సంగతేమిటో కనుక్కోకుండా, కనబడినవాళ్ళను పట్టుకుని దొంగ అంటూ కేకలు పెట్టడం, ఏం మర్యాదా!" అంటూ జనం దశరథయ్యను చీవాట్లు పెట్టి వెళ్ళిపోయారు.

కుర్రాడు కూడా అక్కడి నుంచి వెళ్ళిపోగానే, దశరథయ్య తన కూతురు చేతిలో వున్న డబ్బు సంచీ తీసుకోబోతూ, "నీ పుట్టిన రోజున మంచి బహుమతి లభించింది. ఆ డబ్బుతో నీకు బంగారు గొలుసు చేయిస్తాను," అన్నాడు.

ఆ మాటలకు భార్య అడ్డు వచ్చి, "ఇంకా నయం! పసిపిల్ల వంటి మీద బంగారం వుండడం ప్రమాదం. ఆ డబ్బుతో ముందు నేను గాజులు చేయించుకుంటాను," అన్నది.

సుమతి డబ్బు సంచీ వున్న చేతిని వెనక్కు లాక్కుని, తండ్రిని, "ఈ రోజుతో నాకు ఎన్ని సంవత్సరాలు నిండాయి, నాన్నా?" అని అడిగింది.

"నాకు ఆ మాత్రం గుర్తు లేదనుకోకు, తల్లీ! ఈ రోజుతో నీకు తొమ్మిది నిండి, పది వస్తాయి," అన్నాడు దశరథయ్య.

"ఆ అబ్బాయి తీర్చిన బాకీ పన్నెండేళ్ళ కిందటిది. మనం, ఈ ఇల్లు కొన్న తర్వాత ఏడాదికి నేను పుట్టాను. అంటే, ఆ ఉంగరం మనకు, ఈ ఇల్లమ్మిన రామయ్య తాతదన్నమాట! పిల్లలు సరిగా చూడక, ఆరోగ్యం కూడా చెడి, తాత చాలా కష్టాల్లో వున్నాడు. ఈ డబ్బు తాతకు బాగా ఉపయోగిస్తుంది. ఇది, తాతకు ఇచ్చి వస్తాను," అంటూ సుమతి బయలుదేరబోయింది.

దశరథయ్యా, అతడి భార్యా తమ కూతురి దయాగుణానికి అబ్బురపడ్డారు. దశరథయ్య భార్య కూతురును ఆప్యాయంగా ముద్దాడి, "ఆ డబ్బు, తాతకు రేపు యివ్వవచ్చులే, తల్లీ! ఇప్పుడు మనం గుడికి వెళ్ళాలి," అన్నది.

"ఈ రోజు గుడికి వెళ్ళకపోయినా ఫర్వాలేదు. తాతకు, ఈ డబ్బు యిస్తే నాకు రెట్టింపు పుణ్యం వస్తుంది!" అంటూ సుమతి, రామయ్య తాత ఇంటికేసి పరుగుతీసింది.

వయసులో చిన్నదయినా, తమ కూతురి గొప్ప మనసు చూసి, ఆమె తల్లిదండ్రులు చాలా ఆనందపడ్డారు.





# ధైర్యశాలి!

నారాయణవరం జమీ విస్తీర్ణంలో చిన్నదయినా, అందులో ఎన్నో సంపన్నమైన గ్రామాలుండేవి. ఒక ఏడాది రైతుల నుంచి శిస్తులు సకాలంలో దివాణానికి రాకపోయేసరికి జమీందారు, తన దివానైన కృష్ణస్వామిని ఏం చేయడం బావుంటుందని అడిగాడు.

"అయ్యా, వాళ్ళే దివాణానికి వచ్చి శిస్తులు చెల్లించిపోతారని మనం చూస్తూ వూరుకోవడం మంచిది కాదు. ఒకసారి రైతులకు శిస్తులు చెల్లించడం కొంత అలస్యం అయినా ఫర్వాలేదన్న ధీమా కలిగిందో, మనం అలుసై పోతాం. అందువల్ల, నేనే స్వయంగా బయలుదేరి వెళ్ళి, కొన్ని గ్రామాల్లో శిస్తు వసూలు చేసి, మిగతా గ్రామాలకు హెచ్చరికగా మనుషుల ద్వారా కబురు పెడతాను," అన్నాడు దివాను.

జమీందారుకు, యీ పద్ధతి నచ్చింది. ఆ మర్నాడే దివాను నలుగురు భటులను వెంట బెట్టుకుని శిస్తు వసూలుకు బయలుదేరాడు.

ఒక వారం పాటు వాళ్ళు చాలా గ్రామాలు తిరిగి, రైతుల నుంచి శిస్తు డబ్బు వసూలు చేశారు. తర్వాత నలుగురు భటులూ మిగతా గ్రామాలకు పోయి, వెంటనే శిస్తు డబ్బు దివాణానికి వచ్చి చెల్లించవలసిందిగా, రైతులను హెచ్చరించి తిరిగి వచ్చారు.

దివాను వసూలైన శిస్తు డబ్బును, నాలుగు మూటలుగా కట్టించి, వాటిని నలుగురు భటులు మోసుకురాగా, తాను ముందు గుర్రం మీద దివాణానికి బయలుదేరాడు.

సూర్యాస్తమయవేళకు వాళ్ళు ఒక పెద్ద చెరువు ప్రాంతానికి చేరారు. అక్క

ఖైరి సత్యనారాయణ

డికి అరకోను దూరంలో ఒక చిన్న పల్లె వున్నది.

ఆ రాత్రి, ఆ చిన్న పల్లెలో గడపడం అసౌకర్యంగా వుంటుందని భావించిన దివాను, భటులతో, "ఒరే, బాగా చీకటి పడిపోతున్నది. ఆ కనబడేది మునసబూ, కరణాల్లేని పదిళ్ళ చిన్న పల్లె. అక్కడ నాకు ఆతిథ్యం మాట అట్లా వుంచి, గుర్రానికి దాణా కూడా దొరకదు. నేను దివాణానికి వెళ్ళిపోతాను. మరి, మీ మాటేమిటి ?" అని అడిగాడు.

దివాను చెప్పదలిచిందేమిటో గ్రహించారు, భటులు. వాళ్ళల్లో ఒకడు దివానుతో, "అయ్యా, మేం పగలల్లా బరువు మోయడంతో బాగా అలిసిపోయాం. ఈ రాత్రికి, ఆ కనబడే మర్రి చెట్టు కింద వంట చేసుకుతిని, అక్కడే పడుకుని నిద్రపోయి, తెల్లవారుజామున బయలుదేరుతాం," అన్నాడు.

"బావుంది; అలాగే చేయండి. ఆ శిస్తు డబ్బు జాగ్రత !" అని హెచ్చరించాడు, దివాను.

దివాను వెళ్ళిపోగానే, భటులు నలుగురూ, దాపులనున్న ఊడలమర్రి దగ్గిరకు చేరారు. వాళ్ళు ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకుంటూ వంటపని ముగించి, భోజనాలు చేశారు. తర్వాత, డబ్బు మూటలు



నాల్గింటినీ ఒకచోట చేర్చి, వాటిచుట్టూ పడుకున్నారు.

కొద్దిసేపు గడిచేసరికి, ఆ నలుగురిలో చెంగన్న అనే వాడికి బాగా నిద్ర పట్టిపోయింది. మిగతా భటులు వాణ్ణి చూసి విసుక్కుంటూ, డబ్బు మూటల కాపలాకు జాముకొకడు మేల్కొని వుండాలని ఆలోచిస్తున్నంతలో, గుబురుగా వున్న మర్రిచెట్టు కొమ్మల్లో ఏదో అలికిడి అయింది.

ముగ్గురూ భయపడిపోయి, తలలు ఎత్తి చూశారు. జడలు విరబోసుకున్న నల్లని ఆకారం ఒకటి, మర్రి ఊడ పట్టుకుని కిందికి జారుతూ, "ఏమిరా, మీ

ధైర్యం! నా చెట్టుకిందే వంటలూ, నిద్రలా?'' అంటూ నేలకు దిగింది.

ఆ భయంకరాకారాన్ని చూస్తూనే, ముగ్గురు భటులూ ఒక కేకపెట్టి, అక్కడి నుంచి పారిపోసాగారు. నిద్ర పోతున్న చెంగన్న, ఆ కేకలు విని కళ్ళు తెరిచి, తోటిభటులు పారిపోవడం చూసి, కారణం ఏమిటా అని తల తిప్పి చూశాడు. వాడికి జడలు విరబోసుకు నిలబడి వున్న పిశాచం కంటబడింది.

పారిపోయిన భటులు ముగ్గురూ దివాణం చేరి జరిగిన సంగతి జమీందారుకు చెప్పారు. ఆయన భటులను పిరికివెధవలంటూ తిట్టి, మరి నలుగురు భటులతో, తెల్లవారే సమయానికి మర్రి చెట్టు దగ్గిరకు వచ్చాడు. ఆయనకు చెంగన్న డబ్బు సంచుల మీద రెండు చేతులూ ఆనించి కూర్చుని వుండడం కనిపించింది.

జమీందారు వాడి ధైర్యానికి మెచ్చుకుని, అక్కడికక్కడే నూరు వరహాలు బహుమానం యిచ్చి, డబ్బు సంచులతో తిరుగుప్రయాణం అయాడు.

పారిపోయిన భటుల ద్వారా ముందుగానే, యీ సంగతి అందరికి తెలిసిపోయింది. చెంగన్న ఇల్లు చేరగానే, వాడి భార్య, ''నువ్వింత ధైర్యశాలివని, నేనేనాడూ అనుకోలేదు!'' అన్నది మెచ్చుకుంటూ.

దానికి చెంగన్న, ''నేనెంత ధైర్యశాలినో—నాకూ, ఆ జడలపిశాచానికే తెలును! మిగతా ముగ్గురికీ దాన్ని చూశాక, పారిపోయేందుకు కాళ్ళల్లో సత్తువైనా వున్నది. నాకు, అదీ లేక గుండె బేజారై మూర్ఛపోయాను. తెల్లవారుజామున, జమీందారుగారి గుర్రం గిట్టల చప్పుడుకు స్పృహ తెలిసింది,'' అన్నాడు.

''అలాగా!'' అని చెంగన్న భార్య ఆశ్చర్యపోయి, ''అయితే, నీకూ, నాకూ, ఆ పిశాచానికీ మాత్రమే తెలిసిన, ఈ గుట్టు బయటికి పొక్కకూడదు!'' అన్నది.






# 3

[చిత్రసేనుణ్ణి విచిత్రభవనం నుంచి వచ్చిన మంత్రీ, సేనానాయకుడూ భవనంలోకి తీసుకుపోయారు. ఆ భవనంలో రాజోచితమైన అన్ని సౌకర్యాలూ వున్నవి. మర్నాడు చిత్రసేనుడి తండ్రి తారకేశ్వర మహారాజు వచ్చి, కొడుకును చూసి సంతోషించి, అవసరం అనుకుంటే తన నుంచి ఎలాంటి సహాయమైనా పొందవచ్చునని, అతడితో చెప్పి వెళ్ళిపోయాడు. తరవాత —]

మర్నాటి ఉదయం చిత్రసేనుడు, తండ్రిని సాగనంపి, మంత్రులతో కలిసి, తిరిగి తన భవనం చేరేసరికి, అక్కడ గుంపుగా కూడిన చాలామంది పౌరులు కనిపించారు. వాళ్ళు గొంతులెత్తి, "మహారాజా, మమ్మల్ని కాపాడాలి. ఈ అడవిలో వున్న ఉగ్రాక్షుడూ, వాడి సేవకులూ లోగడ మా పశువుల్ని మాత్రమే ఎత్తుకుపోయేవారు. ఈ మధ్య మనుషుల్ని కూడా ఎత్తుకుపోవటం ప్రారంభించారు," అంటూ విధ్వసాగారు.

ఉగ్రాక్షుడి పేరు వింటూనే చిత్రసేనుడు నిలువెల్లా కంపించిపోయాడు. కాని, అంతలోనే అతడికి ఎక్కడ లేని పౌరుషం వచ్చింది. ఇప్పుడు తను నిస్సహాయుడు కాదు. రాజ్యం, పరివారం, సైన్యం గల రాజు. తన రాజ్యంలోనే వుంటూ ప్రజలను నానా హింసలపాలు



చేసేవాడిని ఎవడినైనాసరే, హతమార్చవలసిన బాధ్యత తన మీద వుంది. అలాంటివాడు ఉగ్రాక్షుడైనా, తను మిన్నకుండేందుకు వీలులేదు.

''మీ పశువుల్నీ, మనుష్యుల్నీ ఎత్తుకుపోతున్నది, ఉగ్రాక్షుడే అని మీకెలా తెలుసు?'' అని అడిగాడు చిత్రసేనుడు.

ఈ ప్రశ్న వింటూనే అక్కడ గుమికూడిన పౌరుల్లో సంచలనం బయలుదేరింది. కొంతసేపటికి నలుగురు పౌరనాయకులు ముందుకు వచ్చి, ''మహారాజా! ఉగ్రాక్షుడు గాని, అతడి సేవకులు గాని పశువుల్ని ఎత్తుకు పోతూవుండగా చూసినవారు చాలామంది వున్నారు. కాని, మనుషుల్ని అపహరించటం కళ్ళారా చూసినవారు మాత్రం లేరు. నరమాంస భక్షకులైన రాక్షసులకు తప్ప, ఇతర్లకు మానవమాత్రుల్ని అపహరించవలసిన అవసరం ఎందుకు కలుగుతుంది!'' అన్నారు.

పౌరనాయకు లిచ్చిన ఈ జవాబు చిత్రసేనుడికి కొంత ఆశ్చర్యం కలిగించింది. పశువుల్ని ఎత్తుకుపోయే రాక్షసులు ఉగ్రాక్షుడి సేవకులే అయినా, మనుష్యుల్ని మాయం చేసేవాళ్ళు మాత్రం, వారై వుండరనుకున్నాడు.

''సరే, మీరు నిశ్చింతగా మీ గూడేలకు వెళ్ళండి. ఒకటి రెండు రోజుల్లో ఆ ఉగ్రాక్షుణ్ణీ, అతడి అనుచరుల్నీ అదుపులో పెట్టే పని నేను చూస్తాను,'' అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడిలా అనగానే మంత్రి అతణ్ణి సమీపించి రహస్యంగా, ''మహారాజా, ఉగ్రాక్షుణ్ణి గురించి దూతల ద్వారా విన్నాను. వాడు మహాభయంకరుడు,'' అన్నాడు.

చిత్రసేనుడు అక్కడి నుంచి భవనంలోకి వెళ్ళేందుకు మెట్లెక్కుతూ, ''వాడు భయంకరుడే కావొచ్చు. అలా అని ఆ రాక్షసుడు మన ప్రజల ధన ప్రాణాలకు నష్టం కలిగిస్తూంటే చూస్తూ వూరుకుం




టామా ? సేనానాయకు డెక్కడ ?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే వెనకగా వస్తున్న సేనానాయకుడు, ''మహారాజా!'' అంటూ ముందుకొచ్చాడు.

''మన సైనికు లెక్కడ? వాళ్ళు సుశిక్షితులూ, ధైర్యసాహసాలు కల వాళ్ళేనా ?'' అన్నాడు చిత్రసేనుడు.

సేనానాయకుడు కొంచెం ఆశ్చర్యం కనబరుస్తూ, ''వాళ్ళ శిక్షణా, ధైర్య సాహసాల మాటా, మహారాజా? కావాలంటే వాళ్ళు కొండల్ని పిండి కొట్ట గలరు!'' అన్నాడు.

''ఓఁ, ఆ కొండల్ని పిండికొట్టటం, బలం వున్న ఏ కూలివాడైనా చేయగలడు. నేనడిగేది అది కాదు. అవసరం అయితే, ఉగ్రాక్షుడికి ఎదురునిలిచి పోరాడే గుండె నిబ్బరం మన సైనికులకున్నదా అని నేను తెలుసుకోదలిచాను,'' అన్నాడు చిత్రసేనుడు.

సేనానాయకుడు నిలువెల్లా కంపించిపోయాడు. తరవాత తడబడే గొంతుతో, ''మహారాజా! ఆ రాక్షసుడు....'' అంటూ అతను ఏమో చెప్పబోయేంతలో, అతడి తత్తరపాటు గ్రహించిన చిత్రసేనుడు నవ్వి, ''సేనానీ, నువ్వే ఆ రాక్షసుడి పేరు విని యింతగా వణికిపోతూంటే, ఇక సైనికుల మాట చెప్పనవసరం లేదు. ఇంతకూ వాళ్ళు నివసించే గుడారా లెక్కడ?'' అని అడిగాడు.

సేనానాయకుడు ముందుండి పడమటి వైపునున్న బురుజు మీదికి దారి తీశాడు. చిత్రసేనుడు అక్కడికి చేరగానే, సేనానాయకుడు బాణం వేటు దూరంలో వున్న చిన్న కొండలూ, పొదల కేసి చేయి చూపుతూ, ''మహారాజా! మన సైనికులు గుడారాలు నిర్మించేందుకు ఆ కొండ ప్రాంతాన్ని చదును చేస్తున్నారు,'' అన్నాడు.

చిత్రసేనుడి దృష్టికి కొన్ని వేలమంది సైనికులు కనిపించారు. వాళ్ళల్లో ప్రతి

ఒక్కడూ పలుగూ, పారా పుచ్చుకుని ఎగుడు దిగుడుగా వున్న కొండప్రాంతాన్ని తవ్వి, పూడ్చి దాన్ని సమతలంగా చేసేందుకు ఎంతో కష్టించి పని చేస్తున్నారు. వాళ్ళను చూస్తూనే చిత్రసేనుడు తను అర్థబలమే గాక, చాలా అంగబలం కూడా వున్న రాజునని తెలుసుకుని గర్వపడ్డాడు. అతడు మనసులో తనకు ఇంత మేలు చేసిన సిద్ధుణ్ణి తలుచుకుని చెప్పలేనంత కృతజ్ఞతా భావంతో తల వంచాడు.

"మహారాజా! ఆ రాక్షసిమూక మీద మన సైన్యాన్ని ఉపయోగించే ముందు, మనం ముందు వెనుకలు బాగా ఆలోచించవలసి వుంటుంది," అన్నాడు మంత్రి.

"మన సైన్యాన్ని ఆ రాక్షసగణం మీద యుద్ధానికి పంపాలని నాకు లేదు. నేనే స్వయంగా ఆ ఉగ్రాక్షుడితో మాట్లాడి చూస్తాను," అంటూ చిత్రసేనుడు సేనానాయకుడి కేసి తిరిగి, "అతడుండేచోటు నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు.

"మన చారుల ద్వారా వాడుండే కోట ప్రాంతం తెలుసుకున్నాను, మహా రాజా! కాని, తమరు ఒంటరిగా....వాడితో...." అంటూ నీళ్ళు నమిలాడు సేనాని.

"నేను ఒంటరిగా అతడి కోటకు వెళ్ళబోవటం లేదు. అక్కడికి దారి చూపేందుకు నా వెంట కొద్దిమంది సైనికులు వుంటారు. రాదలిస్తే నువ్వూ రావొచ్చును," అన్నాడు చిత్రసేనుడు.



"మహారాజా, ఎంత మాట! మీకోసం నేనే కాక, ప్రతి ఒక్క సైనికుడూ ప్రాణాలైనా ఒడ్డటానికి సిద్ధంగా వున్నాం," అన్నాడు సేనానాయకుడు.

ఆ తరవాత కొంతసేపటికి చిత్రసేనుడు కొద్దిమంది సైనికులనూ, సేనానాయకుణ్ణీ వెంటబెట్టుకుని, ఉగ్రాక్షుడి నివాస స్థానానికి బయలుదేరాడు. ఆ రాక్షసుడుంటున్న చోటు ఎరిగివున్న చారులు కొందరు ముందు దారి చూపుతూ నడిచారు. సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు అందరూ అడవిలో చాలా దూరం నడిచి, ఉగ్రాక్షుడుండే కొండ సమీపించారు.

కొండ దిగువ నున్న అడవిలో ఉగ్రాక్షుడి సేవకులైన కొందరు రాక్షసులు చిత్రసేనుణ్ణీ, అతడి వెంట వున్న పరివారాన్నీ చూసి, పట్టరాని ఆనందంతో పొట్టలు చెక్కలయేలా నవ్వుతూ, "ఆహాఁ, ఈ నరమానవులు ఎంత బుద్ధిమంతులు! మనకూ, మన యజమానికీ ఆహారం అయేందుకు, పని కట్టుకుని ఇంత దూరం నడిచి వచ్చారు!" అన్నాడు.

"మీ నాయకుడికి, నేను వస్తున్నట్టు చెప్పండి. నా పేరు చిత్రసేనుడు!" అని చిత్రసేనుడు ఆ రాక్షసులకు చెప్పాడు.

ఈ మాటలు వింటూనే రాక్షసులు మరింత బిగ్గరగా నవ్వారు. "నరమాంసం అంతా ఒకే రకం రుచి, నీ మాంసం ఎక్కువేమిటి? నీ దుస్తులూ అవీ చూస్తూంటే, చాలా విలువైనవిలా కనబడు





తున్నవి. నువ్వు కొంపదీసి రాజువా, ఏం?'' అని అడిగారు వాళ్ళు.

''అవును. రాజునే, చిత్రసేన మహారాజును. ఇంకా అధిక ప్రసంగం చేస్తే తాట ఒలుస్తాను. ఇక్కడికి నాలుగైదామడల దూరంలో అడవి మధ్య వున్న మహాభవనం సంగతి మీకు తెలుసా?'' అన్నాడు చిత్రసేనుడు కోపంగా.

ఆ భవనం పేరు వింటూనే రాక్షసులు తత్తరబిత్తర పడుతూ, ''ప్రభో, మన్నించండి! మా నాయకుడు మిమ్మల్ని గురించి చెప్పాడు. మాకు ముందు ముందు కాబోయే మహానాయకుణ్ణి మీరే పంపుతారట. రండి, దయచెయ్యండి, మా నాయకుడు కోటలోనే వున్నాడు,'' అంటూ చిత్రసేనుడికీ, అతడి పరివారానికీ అడుగులకు మడుగులొత్తుతూ ఉగ్రాక్షుడి కోటకేసి దారితీశారు.

ఉగ్రాక్షుడు నివసించే కోట చాలా విచిత్రమైనది. అతడు అడవి మధ్య వున్న ఒక చిన్న కొండను తొలిపించి, అందులోనే గదులూ, ద్వారాలూ, బురుజులూ—అన్నీ ఏర్పాటు చేయించుకున్నాడు. కోట చుట్టూ వున్న ఎత్తయిన గోడా, దాని మీద నాలుగు దిక్కులా వున్న పెద్ద బురుజులూ, దాని ముఖద్వారం—అంతా ఒకే రాతిలో మలచబడింది. యుద్ధం చేసి రాక్షసుడి కోటను పట్టదలిచిన మానవ మాత్రుడెవడైనా వుంటే—అది సాధ్యమయే పని కాదు. మరో రాక్షసుడైనా దాన్ని ఆక్రమించుకోవటం దుస్సాధ్యం.

చిత్రసేనుడు ఈ వింత కోటను ఆశ్చర్యంగా చూస్తూ, ముఖద్వారం దాటి లోపల ప్రవేశించగానే, ఉగ్రాక్షుడి వికటాట్టహాసం వినబడింది. అతడు తన గృహం ముందున్న ఒక ఎత్తయిన రాతి ఆసనం మీద కూచుని వున్నాడు.

''ఓ చిత్రసేనా, ఏడి నువ్వు వాగ్దానం చేసిన నీ జ్యేష్ఠపుత్రుడు, ఎక్కడ?'' అంటూ ఉగ్రాక్షుడు అందర్నీ కలయ చూశాడు.



"ఉగ్రాక్షా, నీకేమైనా మతి చాంచల్యం కలిగిందా? నిన్న కాక మొన్ననేగదా నేను నీకు వాగ్దానం చేసింది! అప్పుడే పద్దెనిమిదేళ్ళూ గడిచినై అని ఎలా అను కున్నావ్?" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి మాటలకు ఉగ్రాక్షుడు మరింత బిగ్గరగా నవ్వాడు.

"రాక్షసుడు మతి మతిలో వున్నప్పుడే, మానవజాతికి మహా భయంకరుడు. అలాంటప్పుడు మతి చెడి పిచ్చె యెత్తటం జరిగితే, మానవజాతే నశించిపోతుంది," అన్నాడు ఉగ్రాక్షుడు.

"మానవజాతి సంగతేమో నాకు తెలి యదు గాని, ముఖ్యంగా నా రాజ్యంలోని మానవులు మాత్రం నశించిపోతున్నారు," అన్నాడు చిత్రసేనుడు.

"నీ రాజ్యమా?" అంటూ ఉగ్రాక్షుడు ఆశ్చర్యపడి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ, "అవును, ఈ ఉగ్రాక్షుడి అడవి అంతా నీ రాజ్యమే! నర్మదానదీ తీరాన వున్న ధవళగిరి రాజ్యం వైపు తప్ప, తతిమ్మా అన్ని దిక్కులా, ఈ ఉగ్రాక్షుడి అడవి ఎటు చూసినా నూరు ఆమడలు!" అన్నాడు.

"ఈ అడవి మధ్య వున్న గ్రామాల్లో, గూడేల్లో వున్న ప్రజలను నీ అనుచరులు అపహరిస్తున్నారు, పశువులను ఎత్తుకు పోతున్నారు. ఇది నువ్వు చేసిన వాగ్దానానికి విరుద్ధం. నన్ను హాయిగా ఈ ప్రాంతాన్ని పాలిస్తూ వుండనిచ్చేందుకు అంగీకరిం చావు గదా?" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు వెలవెలపోయాడు. ఏదో మాట్లాడబోయి, అంతలోనే ఆగి, తన కెదురుగా వున్న పెద్ద బండరాళ్ళకేసి చేయి చూపుతూ, "అందరూ ఆ పీఠాల మీద సుఖంగా కూచోండి," అని, చిత్ర సేనుడి కేసి చూస్తూ, "చిత్రసేనా! నువ్వు పొరబడ్డావు. నీ ఈ అడవి రాజ్యంలో జరిగే మానవాపహరణలకు బాధ్యులు నా అనుచరులు కాదు," అన్నాడు.

''నువ్వుగాని, నీ అనుచరులు గాని, మనుషుల జోలికే వెళ్ళటం లేదని నువ్వు నన్ను నమ్మించచూస్తున్నావా, ఉగ్రాక్షా?'' అన్నాడు చిత్రసేనుడు కోపంగా.

''నా అనుచరులు అసలు మానవుల్ని తాకటం లేదని నేను చెప్పటం లేదు. ఏదో పండగకీ పబ్బానికీ ఒకణ్ణీ అరా ఎత్తుకుపోయి భక్షించి వుండవచ్చు. కాని, గ్రామాల మీద పడి మనుషుల్ని ఎత్తుకు పోతున్న వాళ్ళు మరొకరు. వాళ్ళు రాక్షసులకన్నా క్రూరులు, భయంకరులు!'' అంటూ ఉగ్రాక్షుడు ఆగి, సాలోచనగా చిత్రసేనుడి కేసి చూస్తూ, ''జ్వాలాద్వీపం పేరు ఎప్పుడైనా విన్నావా, చిత్రసేనా?'' అని అడిగాడు.

''అలాంటి పేరు గల ద్వీపం ఒకటి వున్నదనే సంగతే నాకు తెలియదే!'' అన్నాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

''అయితే, ఈ రాత్రికి నువ్వూ, నీ అనుచరులూ ఇక్కడ వుండేట్టయితే, ఆ ద్వీపాన్నుంచి రాత్రివేళల ఈ అడవి ప్రాంతాలకు వచ్చి పోయే ఆ క్రూరుల్ని నీకు చూపెడతాను. వాళ్ళు బలంలో మా రాక్షసులకు తీసికట్టే. కాని, వాళ్ళు ఎక్కివచ్చే భీకరమైన వింత మృగాలు—వాటికి రెక్కలు వుండి, ఆకాశంలో ఎగురుతవి గనక పక్షులందాం....వాటి ధాటికి తట్టుకునే శక్తి మాలో ఎవరికీ లేదు. అప్పటికీ, ఆ జ్వాలాద్వీపం నుంచి వింతపక్షి మీద సవారై వచ్చిన ఒకణ్ణి ప్రాణాలతో పట్టుకున్నాం. కాని వాడు ఏ కారణం వల్లనో మర్నాటికల్లా చచ్చి పోయాడు. వాడి కంకాళాన్ని చూడదలిస్తే, నా వెంట రా,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''చచ్చినవాడి కంకాళాన్ని కాదు.... నువ్వు చెప్పే మాటే నిజమయితే, ప్రాణాలతో వున్న ఆ దుర్మార్గుల్నీ, వాళ్ళు ఎక్కివచ్చే భయంకరపక్షుల్నీ నాకు చూడాలని వుంది,'' అన్నాడు చిత్రసేనుడు.

ఇందుకు సరేనన్నట్టు ఉగ్రాక్షుడు తల వూపాడు. —(ఇంకావుంది)






# మంచి చెడ్డలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, వరసగా వైఫల్యాలకు గురి అవుతూ కూడా, నువ్వు పట్టు వదలక, ఈ అర్ధ రాత్రి వేళ శ్మశానంలో తిరుగుతూండడం, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది. నువ్వు పడుతున్న ఈ శ్రమ అంతా పరులకు మంచి చేయడానికా లేక చెడ్డ చేయడానికా? లోకంలో మంచి చెడులను గురించిన ధర్మసూక్ష్మం అర్థం చేసుకోవడం, అందరికీ చేతకాదు. ఆ కారణం వల్లనే మంచివాడు నష్టపోవడం, చెడ్డవాడు లాభపడడం, తరచూ చూస్తూంటాం. ఇందుకు ఉదాహరణగా నీకు, ఇద్దరు వర్తకుల కథ చెబుతాను, శ్రమ తెలియ

## బేతాళ కథలు



కుండా విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు :

ఒకానొక నగరంలో సత్యపాలుడు, వజ్రనాభుడు అనే ఇద్దరు వర్తకులుండే వారు. సత్యపాలుడు నీతినీ, నిజాయితీని నమ్ముకుని సత్ప్రవర్తనతో కోటికి పడగ లెత్తాడు. వజ్రనాభుడు వ్యాపారంలో లాభాల కోసం తొక్కని చెడ్డమార్గం లేదు. అందువల్ల, అతడంటే నగరంలో చాలా మంది భయపడేవారు.

వజ్రనాభుడి తాత పద్మనాభుడికి, తన మనవడి ప్రవర్తన చూసి చాలా బాధగా వుండేది. అయన వజ్రనాభుడికి ఎన్నో సార్లు హితబోధ చేశాడు. అయితే, వజ్రనాభుడు ప్రతిసారీ, ''నేను వ్యాపార ధర్మాన్ని పాటిస్తున్నాను తప్పితే, అధర్మంగా ప్రవర్తించడం లేదు,'' అని జవాబిస్తూండేవాడు.

''నాయనా, వ్యాపార ధర్మానికి మించినది, మానవ ధర్మం! నువ్వది పట్టించుకోవడంలేదు. నా మాట విని సత్యపాలుణ్ణి అదర్శంగా పెట్టుకో!'' అని పద్మనాభుడు మనవణ్ణి పదే పదే హెచ్చరించాడు. కాని, వజ్రనాభుడు ఆ మాటలను లెక్కచేయలేదు.

చివరకు బాగా విసిగిపోయిన పద్మనాభుడు, నగరం వెలపల ఆశ్రమజీవితం గడుపుతున్న ఒక మహాయోగిని దర్శించి, తన మనవణ్ణి గురించి చెప్పి, ''స్వామీ, తాను చేసే చెడ్డపనులవల్ల, వజ్రనాభుడు ఎప్పటికైనా నష్టపోగలడని, నాకు భయంగా వున్నది. వాడిలో మార్పు వచ్చే ఉపాయమేదైనా తమరే చెప్పాలి,'' అని కోరాడు.

మహాయోగి కొంచెంసేపు అలోచించి, ''నగరంలో సత్యపాలుడు వ్యాపారంలో కోటికి పడగలెత్తాడు. అయినప్పటికీ, ఇతర వ్యాపారులు వజ్రనాభుడినే అనుసరించాలనుకుంటున్నారు. ఎందుకంటే, వ్యాపారానికి అవినీతి సులభమార్గం. వజ్రనాభుడిలో మార్పు వస్తే, అది

నగరంలోని ఎందరో వ్యాపారులను సన్మార్గాన పెడుతుంది. ఇందుకు, నేను తప్పక ఉపాయం చెప్పగలను. నీ మనవణ్ణొకసారి నా దగ్గిరకు పంపించు," అన్నాడు.

పద్మనాభుడి ఆదేశం మీద, వజ్రనాభుడు మహాయోగిని చూడబోయాడు. యోగి అతణ్ణి ఆశీర్వదించి, "వత్సా! సమీపారణ్య మధ్యంలో, వరాహగిరి వున్నది. ఆ కొండశిఖరాన, ఒక గుహ వున్నది. అందులో హరితశిలలున్నవి. అవి నలుచదరాకారంలో, పచ్చగా మెరుస్తుంటవి. ఆ శిల ఒకటి దగ్గర వున్నవాడికి, పట్టిందల్లా బంగారమవుతుంది. అయితే, ఆ శిలను తెచ్చుకునేటప్పుడు, తోడుగా సత్ప్రవర్తన ప్రాణంగా, నీతి నిజాయితీలతో వర్తకం చేసే వ్యాపారి వుండాలి. మీ తాతగారి కోరికపై, నేనీ రహస్యాన్ని నీకు చెబుతున్నాను," అన్నాడు.

ఇది విని వజ్రనాభుడు చాలా సంతోషించాడు. తనకు తోడుగా రావడానికి సత్యపాలుడే తగినవాడని, అతడికి తెలుసు.

వజ్రనాభుడు, సత్యపాలుడి దగ్గిరకు పోయి, "వ్యాపారం పేరుతో ఎన్నో పాపాలు చేశాను. ఆ పాపాలు పోవాలంటే, సత్ప్రవర్తనగల వ్యాపారితో కలిసి వెళ్ళి, వరాహగిరి కొండ గుహలోని భగవంతుడి విగ్రహానికి సాష్టాంగపడి





రావాలట. నువ్వు, నాకు తోడురాగలవా?" అని అడిగాడు.

వజ్రనాభుడిలో మార్పు వస్తున్నందుకు, సత్యపాలుడు ఎంతో సంతోషించి, అతడికి సాయపడాలనుకున్నాడు. ఇద్దరూ కలిసి ప్రయాణమయ్యారు. నాలుగు రోజులు శ్రమపడి వాళ్ళు, అరణ్య మధ్యంలోని వరాహగిరి శిఖరం చేరుకుని, అక్కడున్న గుహలో ప్రవేశించారు.

గుహ లోపల చిమ్మ చీకటిగా వున్నది. వాళ్లిద్దరూ లోపల అడుగు పెట్టగానే, ''ఎవరది?'' అన్న పెద్ద కేక వినిపించింది. ఆ వెంటనే గుహ ద్వారానికి అడ్డంగా, ఒక పెద్ద బండరాయి పడింది.

భయంతో వజ్రనాభుడికి గొంతు పెగలలేదు. ''మేము భగవద్దర్శనానికి వచ్చాము. లోపల ఎవరున్నారు?'' అన్నాడు సత్యపాలుడు గంభీరంగా.

''నన్ను చూస్తారా?'' అని ఎవరో నవ్వారు.

ఆ మరుక్షణం గుహ అంతా వెలుగుతో నిండిపోయింది. తమ ఎదుట నిలబడిన భయంకరాకారుణ్ణి చూసి, సత్యపాలుడూ, వజ్రనాభుడూ నిలువెల్లా వణికిపోయారు.

కొద్దిసేపటికి సత్యపాలుడు ధైర్యం తెచ్చుకుని, ''అయ్యా, నీవెవరివి? ఈ గుహలో ఎందుకున్నావు? మావల్ల, నీకు కాగల ఉపకారం ఏమైనా వున్నదా?'' అని అడిగాడు.

భయంకరాకారుడు అతి భీకరంగా నవ్వి, ''ఈ గుహలో హరితశిలలున్నవి. అవి ఎవరి దగ్గిర వుంటే వారికి, పట్టిందల్లా బంగారమవుతుంది. అర్హుడైన వాడికి వాటినిస్తే, మరుక్షణం నాకీ భయంకర రూపం పోతుంది,'' అన్నాడు.

''హరితశిలలు తీసుకునేందుకు అర్హతలేమిట?'' అని అడిగాడు సత్యపాలుడు.

''మంచితనమొక్కటే అందుకు అర్హత,'' అన్నాడు భయంకరాకారుడు.

ఆ జవాబు వింటూనే వజ్రనాభుడు తేరుకుని, సంతోషంగా, "నేను చాలా మంచివాణ్ణి. ఆ హరితశిలలు నాకివ్వు." అన్నాడు.

"నువ్వు మంచివాడివి కాదు; చాలా చెడ్డపనులు చేశావు. సీతమ్మ అనే పేద రాలి వద్ద, పదివేల వరహాలు చేసే బంగారం తీసుకుని, నూరు వరహాలు మాత్రం యిచ్చావు." అన్నాడు భయంక రాకారుడు.

తన రహస్యం భయంకరాకారుడికి తెలిసిపోయినందుకు, ఆశ్చర్యపడినా, చలించకుండా, "వ్యాపారంలో పైకి రావాలంటే, ఆ మాత్రపు టన్యాయం అవసరం అవుతుంది. నాతోటి వ్యాపారి రత్నగుప్తుడైతే, ఆ సీతమ్మ ఇంటిని అన్యాయంగా సొంతం చేసుకున్నాడు. అతడితో పోల్చితే, నా తప్పు పెద్దది కాదు." అన్నాడు వజ్రనాభుడు.

అయితే, భయంకరాకారుడు, ఈ జవాబు విని తృప్తి చెందక, వరసగా వజ్రనాభుడి నేరాలు చెప్పాడు. వజ్ర నాభుడు, ప్రతిదానికీ అంతకంటె పెద్ద నేరాలు చేసిన ఇతరుల గురించి చెప్పాడు.

చివరకు భయంకరాకారుడు చెవులు మూసుకుని, "నీ పేరు చెప్పి ప్రపంచం లోని పాపకార్యాలన్నీ వినవలసి వస్తున్నది. నేను హరితశిలలు నీకివ్వను; సత్య పాలుడికిస్తాను. అతడు మంచివాడు," అన్నాడు.





"ఏమిటతడి మంచితనం?" అని అడిగాడు వజ్రనాభుడు కోపంగా.

"అతడు సీతమ్మ కథ విని, జాలిపడి, తన వ్యాపారాల్లో ఒకదాంట్లో, ఆమెకు వాటా యిచ్చాడు," అన్నాడు భయంకరాకారుడు.

వజ్రనాభుడు వెంటనే, "వ్యాపారంలో వాటా యివ్వడానికి, సత్యపాలుడు, సీతమ్మ వద్ద పాతికవరహాలు తీసుకున్నాడు. గుణసేను డనే ఇంకొక వ్యాపారి, కేవలం ఒక్కవరహా మాత్రం తీసుకుని, ఆమెకు తన వ్యాపారంలో సత్యపాలుడి కంటే పెద్ద వాటా యిచ్చాడు. అంటే, సత్యపాలుడు చూపతగినంత మంచితనం ఆమెపట్ల చూపలేదు. అది కూడా చెడ్డతనమే!" అన్నాడు.

అంతటితో ఆగకుండా భయంకరాకారుడు, వరసగా సత్యపాలుడు చేసిన మంచి పనులను గురించి చెపుతూ వచ్చాడు.

ఉన్నట్టుండి గుహలో పెద్ద మెరుపు మెరిసింది. భయంకరాకారుడి స్థానంలో మందహాసం చేస్తూ ఒక గంధర్వుడు ప్రత్యక్షమయాడు. అతడు వారిద్దరికీ వినయంగా నమస్కరించి, "మీ కారణంగా ప్రపంచంలోని సత్కార్యాల గురించి విన్నాను. అందువల్ల లభించిన పుణ్యంతో, నా భయంకరాకారం పోయింది. మీ ఇద్దరికీ, నా కృతజ్ఞతలు. గుహలోని హరితశిలలలో, ఒక్కటి మాత్రమే మీకివ్వగలను. మీలో ఎవరి కివ్వను?" అన్నాడు.

"నీకెవరి కివ్వాలనిపించితే, వాళ్ళ కివ్వు," అన్నాడు సత్యపాలుడు.

"సత్కార్యాల గురించి వింటేనే పుణ్యం వచ్చి, నీ శాపం పోయింది. ఇక, స్వయంగా సత్కార్యాలు చేస్తే ఎంత పుణ్యమో! ఇక మీదట నేను, నా దారి మార్చుకుంటాను. సత్ప్రవర్తనతో మసులుకుంటాను. హరితశిలను, నా కివ్వు," అన్నాడు వజ్రనాభుడు.

గంధర్వుడు హరితశిలను, వజ్రనాభుడి కిచ్చి మాయమైపోయాడు. ఆ మరుక్షణం గుహకు అడ్డంగా పడిన బండరాయి, వెనక్కు పడిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గంధర్వుడు హరితశిలను నీతిమంతుడైన సత్యపాలుడి కివ్వక, చెడ్డవాడని తెలిసి కూడా, దాన్ని వజ్రనాభుడి కెందు కిచ్చాడు? అతడి కారణంగా తనకు శాపవిమోచనం కలిగిందనా? లేక అతడు ఇక నుంచి సన్మార్గాన నడుస్తానని చెప్పిన మాట మీద నమ్మకం వుంచా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హరితశిలను గంధర్వుడు, వజ్రనాభుడి కివ్వడంలో, పైకి చెడ్డవాడు లాభపడినట్టూ, మంచి వాడు నష్టపోయినట్టూ కనిపించవచ్చు. కాని, తరిచిచూస్తే, అది నిజం కాదని తెలుస్తుంది. సత్యపాలుడు సన్మార్గాన్నను సరించి వ్యాపారం చేస్తూ, కోటికి పడగ లెత్తాడు. అలాంటి వాడివల్ల సమాజంలో, ఏ వ్యక్తికీ నష్టముండదు. సత్కార్యాలు ఎటువంటి మంచి ఫలితాలివ్వగలవో స్వయంగా చూసి, వజ్రనాభుడు తానూ సత్ప్రవర్తన అలవరచుకోవాలని తీర్మా నించుకున్నాడు. కాని, రేపు ఆ విధమైన ప్రవర్తనవల్ల, వ్యాపారంలో లాభాలు రాక పోతే, అతడు తప్పకపూర్వధోరణిలో అన్యాయాలకు సిద్ధపడతాడు. అందువల్ల, ఎందరో కష్టాలకు గురి అవుతారు. మహా యోగి చెప్పినట్టు—పట్టిందల్లా బంగారం చేయగల హరితశిల అతడి దగ్గిర వుంటే, అతడు ధనాశకొద్దీ చెడ్డపనులు చేసే అవసరం, జీవితంలో మరి కలగదు. ఈ ధర్మసూక్ష్మం తెలిసినందునే, గంధర్వుడు హరితశిలను వజ్రనాభుడి కిచ్చాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అభిప్రాయం!

ఒక జమీందారు సాయంకాలంవేళ, తన కోట ఆవరణలోని పండ్లతోటలో తిరుగుతూండగా, దివాణం గుమాస్తా ఏదో పనిపడి అక్కడికి వచ్చాడు. జమీందారు అతడితో మాట్లాడి, తీరా అతను వెళ్ళబోతున్న సమయంలో ఆపి, కొత్తగా చేయించి వేలికి పెట్టుకున్న వజ్రపుటుంగరాన్ని చూపుతూ, "దీన్ని తయారుచేసినవాడు మంచి పనిమంతుడు. వజ్రం కూడా చాలా విలువైనదే. ఎలా మెరుస్తున్నదో చూడు! ఉంగరం ఎలా వున్నదంటావు?" అని అడిగాడు.

గుమాస్తా జవాబేమీ ఇవ్వలేదు. జమీందారు కొంచెం ఆగి, "ఉంగరాన్ని గురించి నీ అభిప్రాయం చెప్పవేం?" అని ప్రశ్నించాడు.

దానికి గుమాస్తా, "ప్రభువులు, క్షమించాలి! తమరు ఉంగరం ఎలా వున్నదని అడిగితే తప్పక నా అభిప్రాయం చెప్పేవాణ్ణి. అలాకాక, తమరే ఉంగరాన్ని అంతగా మెచ్చుకుంటూ చెప్పిన తరవాత, కాదని ఖండించే సాహసం చెయ్యలేను కదా! ఒకవేళ, మీ అభిప్రాయంతో ఏకీభవించినా, అది అంతగా మీకు సంతృప్తికారణం కాకపోవచ్చు. అందుకే మౌనం వహించాను," అన్నాడు.

యజమాని అయినవాడు కొన్ని, కొన్ని సందర్భాలలో, తన పరివారంతో ఎలా సంభాషించాలో, గుమాస్తా సూక్ష్మంగా, చమత్కారంగా చెప్పినందుకు జమీందారు మెచ్చి, ఉంగరాన్ని అతడికి బహుమానంగా యిచ్చేశాడు.

—భీమవరపు పురుషోత్తం






మన దేవాలయాలు :

## ఉడుపి

శ్రీ కృష్ణుడు పెరిగి పెద్దవాడయిన తరవాత, తల్లి దేవకీదేవికి, అతణ్ణి బాల్య రూపంలో చూడాలన్న కోరిక కలిగిందట. ఆమె కోరిక ప్రకారం దేవతల శిల్పి విశ్వకర్మ బాలకృష్ణుడి విగ్రహం రూపొందించి ఆమె కిచ్చాడు.

ఆ విగ్రహం కొన్నేళ్ళకు, అర్జునుడి చేతికి వచ్చింది. ప్రభాసతీర్థంలో శ్రీ కృష్ణుడు అవతారం చాలించిన తరవాత, అర్జునుడు బాలకృష్ణుడి విగ్రహాన్ని, అక్కడ ఇసుక కింద దాచాడు. క్రమంగా ఆ విగ్రహం మీది మన్ను కాంతివంతంగా ప్రకాశించసాగింది.





వేనవేలు సంవత్సరాలు గడిచాయి. పధ్నాలగవ శతాబ్దంలో, ఒక ఓడ ఆ ప్రాంతం కేసి వచ్చి అక్కడ కొంతసేపు ఆగింది. ఆ ఓడ నాయకుడు, కాంతులు విరజిమ్ముతూన్న మట్టి కేసి చూసి, అమితాశ్చర్యం చెంది, దానిని పెకలించి, సంచీలో వేసి మూటగట్టి ఓడలోకి ఎక్కించుకుని ప్రయాణమయ్యాడు.



మధ్వాచార్యులు ఒకనాడు, కర్ణాటక ఉడుపి సముద్రతీరంలో కూర్చుని ధ్యానంలో గడిపాడు. కొంతసేపటికి ఆయనకు సముద్రమధ్యంలో ఒక ఓడ రావడం కనిపించింది.

హఠాత్తుగా సముద్రంలో తుఫాను చెల రేగింది. ఓడ తుఫానులో అల్లాడ సాగింది. ఓడలో ఉన్నవారు ఏమి చేయడానికి దిక్కు తోచక భయపడ సాగారు.





తీరంలో ఉన్న మధ్వాచార్యులు, కాషాయవస్త్రాన్ని చేతితో పైకెత్తి గాలిలో అటూ ఇటూ ఊపసాగాడు. ఆ దృశ్యం ఓడ నాయకుడి కంటబడింది. అతడు సంతోషంతో ఓడను తీరం కేసి నడిపించాడు. ఓడ తీరం చేరింది.

నావికుడు, మధ్వాచార్యుల పాదాలకు నమస్కరించి, "స్వామీ, మీరు తుఫాను నుంచి ఓడనూ, మా ప్రాణాలనూ కాపాడారు. ఈ ఓడలో ఉన్న వాటిలో మీకిష్టమైన దానిని స్వీకరించండి," అన్నాడు. మధ్వాచార్యులు కొంతసేపు మౌనంగా ఉండి, "అలాగా, అయితే నేను ఆ ఓడలో ఏమున్నదో చూస్తాను," అన్నాడు.





మధ్వాచార్యులు ఓడ లోపలకు వెళ్ళాడు. ఓడలో ఎన్నో విలువైన వస్తువులు ఆయనకు చూపారు. అయినా, వాటిలో ఏ ఒక్కటీ ఆయన దృష్టిని ఆకర్షించలేదు. ఆఖరికి ఓడలో ఒక మూలగా ఉన్న మూటను చూసి, ఆయన ఎంతో సంతోషంగా దానిని కౌగిలించుకున్నాడు.

"స్వామీ, ఆ మూటలో కేవలం బంక మన్ను మాత్రమే ఉన్నది. ఓడలో లక్షల కొద్దీ విలువ చేసే వస్తువులు ఎన్నో ఉన్నాయి. వాటిని స్వీకరించరాదా?" అన్నాడు ఓడనాయకుడు. మధ్వాచార్యులు చిన్నగా నవ్వి, మూట విప్పి, సంచీలోని మట్టిముద్దను పగులగొట్టాడు. అందులో నుంచి బాలకృష్ణుడి విగ్రహం బయటపడింది!





మధ్వాచార్యులు ఒక ఆలయం నిర్మించి, ఆ విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. ఎనమండుగురు శిష్యులను ఎన్నుకుని, ఆలయ పూజావిధులను కొనసాగించమని ఆజ్ఞాపించాడు. వారికి భక్తి తత్వాన్ని బోధించాడు. ఎనమండుగురు శిష్యులూ ఎనిమిది మఠాలు నెలకొల్పారు!

మధ్వాచార్యుల కాలం నుంచి, దేవాలయంలో పూజా కార్యక్రమాలు నిరంతరాయంగా కొనసాగుతున్నాయి. గర్భగుడిలో మధ్వాచార్యులు వెలిగించిన దీపాలు కొన్ని, ఇంకా ఆరకుండా వెలుగుతున్నాయని చెబుతారు.





ఎనమండుగురు మఠాధిపతులలో, ఒక్కొక్కరు రెండేసి సంవత్సరాలు, దేవాలయ నిర్వహణా బాధ్యతలు వహిస్తారు. ఒక మఠాధిపతి నుంచి మరొక మఠాధిపతి బాధ్యతలు స్వీకరించే ఉత్సవాన్ని 'పర్యాయ' అని అంటారు. పర్యాయ ఉత్సవ సందర్భంలో ఉడుపి క్షేత్రంలో బ్రహ్మాండమైన ఊరేగింపు జరుగుతుంది!



# కట్టుకథ

కోసలరాజైన శైలేంద్రవర్మ, ఒకనాటి సాయంకాలం వేళ, తన విదూషకుడు శకటుడిని వెంటబెట్టుకుని ఉద్యాన వనానికి వెళ్ళాడు. ఆ సమయంలో కాపలా భటుడు వచ్చి, ఎవరో పండితుడు రాజదర్శనం కోరుతున్నట్టు, ఆయనకు తెలియబరిచాడు.

శైలేంద్రవర్మ, భటుడితో పండితుణ్ణి తీసుకురావలసిందిగా చెప్పాడు. పండితుడు వచ్చి, రాజుకు నమస్కరించి, "మహారాజా, నేను వత్సదేశం వాణ్ణి. నా పేరు శోధకుడు. తమ దర్శనార్థం వచ్చాను," అన్నాడు.

వత్సదేశం పట్ల శైలేంద్రవర్మకు విరోధం లేకపోయినా, లోలోపల చులకన భావం మాత్రం వున్నది. ఆయన పండితుడి మాటలు విని మందహాసం చేసి, "అలాగా! వత్సదేశపు కవి పండితులు దేశాలు పట్టినట్టున్నదే," అన్నాడు హేళనగా.

అందుకు శోధకుడు, "మహారాజా, తమ రన్నది అక్షరాలా నిజం. తమతో పోల్చినప్పుడు, మా మహారాజు సాహిత్యాభిమానం ఏపాటిదో, తమకు వివరించవలసిన అవసరం లేదు గదా," అన్నాడు వినయంగా.

ఆ జవాబుకు ఎంతగానో సంతోషించిన శైలేంద్రవర్మ, "మీ వత్సదేశపు కోశాగారం పూర్తిగా వట్టిపోయినట్టు కనబడుతున్నది. ఆ కారణం వల్లనే మీ రాజు, తన ఆస్థాన పండితులను దేశదేశాలకు పోయి, యాచించి జీవయాత్ర సాగించమని చెప్పి వుంటాడు," అన్నాడు.

రాజు శైలేంద్రవర్మ మాటల్లోని హేళన ఏ మాత్రం పట్టించుకోకుండా శోధకుడు చిన్నగా నవ్వి, "తమ కోసలదేశంతో సరి

జొన్నలగడ్డ రత్న



పోలిస్తే, వత్సదేశపు వనరులూ, సంపదా ఏపాటివి! అందుచేత, మా రాజుగారి కోశాగారం గురించీ, ఆయన ఇబ్బందుల గురించీ, తమరు నన్ను అంతగా అడక్కుండానే చక్కగా గ్రహించారు,'' అన్నాడు.

శోధకుడి మాటలకు మరింతగా సంతోషించిన శైలేంద్రవర్మ; తన మెడలోని హారం తీయబోతూండగా, జరగనున్నది ఊహించిన విదూషకుడు, ఆయనతో, ''ప్రభూ, ఒక్కక్షణం ఆగండి! ఈ వత్స దేశపు పండితుడి అసలు పాండిత్యం ఏపాటిదో, తమరింతవరకూ పరీక్షించ నేలేదు. అయితే, కట్టుకథలల్లడం అన్న పరీక్షలో మాత్రం, ఈయన నెగ్గాడు,'' అన్నాడు.

విదూషకుడి మాటలకు శోధకుడు ముఖం చిన్నబుచ్చుకుని రాజు కేసి చూశాడు.

రాజు కోపంగా విదూషకుడితో, ''అసందర్భంగా మాట్లాడకు. కట్టుకథ! అసలు కట్టుకథ అంటే ఏమిటి?'' అని ప్రశ్నించాడు.

''ప్రభూ, కట్టుకథ అనేదానికి ఎంతో గొప్పదైన సామాజిక, సాహిత్య చరిత్ర వున్నది. ఈ విషయం, రాత్రి మా ఇంటి కొచ్చిన బంధువు—ఆయన వత్స దేశపు రాజాస్థానపండితుడు—చెప్పగా విన్నాను. అయితే ఇప్పుడు అదంతా వినడం, ఈ శోధక పండితుల వారికి విసుగనిపించ వచ్చు. ఆయనను కాస్త వెళ్ళి, ఆ పొద రింటి వెనకవున్న శిలాఫలకం మీద కొంచెంసేపు హాయిగా విశ్రమించమనండి. తమకు, ఆ కట్టుకథ చరిత్ర వివరంగా మనవి చేస్తాను,'' అన్నాడు విదూషకుడు వినయంగా.

విదూషకుడు ఏదో ముఖ్య విషయం చెప్పనున్నాడని గ్రహించిన రాజు, పండితుడి కేసి చూశాడు. శోధకుడు వెంటనే అక్కడినుంచి పొదరింటి కేసి బయలు దేరాడు.

అప్పుడు రాజు, విదూషకుణ్ణి చెప్ప దలచినదేమిటో త్వరగా చెప్పమన్నాడు.

"మహారాజా, మనకు ఇష్టం లేని వాళ్ళను గురించి, మనకు ఎంతో ఇష్ట మయ్యేలాగా అకట్టుకుంటూ చెప్పడం కూడా, ఒకవిధమైన కట్టుకథే!" అన్నాడు విదూషకుడు.

"నువ్వు చెప్పదలిచిందేమిటో సరిగా చెప్పు. మాటల గారడీ చెయ్యకు," అన్నాడు రాజు విసుగ్గా.

"ఈ శోధకుడు ఏపాటి పండితుడో తెలియదుగాని, నక్క వినయంలో ఘటి కుడు. వత్స రాజ్యం మనరాజ్యం కన్న చిన్నదే కావచ్చు. కాని, వర్ధనుడు తనకు సాధ్యమైనంతలో, కవిపండితులను ఆదరిస్తూనే వున్నాడు. ఈ సంగతి తమకు తెలియందికాదు," అన్నాడు విదూషకుడు.

రాజు అవును, కాదనకుండా తలాడించి వూరుకున్నాడు.

విదూషకుడు ఎంతో వినయంగా, "ఆ రాజూ, తమరూ ఒకప్పుడు నలందలో సహాధ్యాయులని అందరెరిగినదే. ఏదో కారణంగా మీ ఇద్దరి మధ్యా కొంత అసూయాభావం వున్నది. ఈ సంగతి మాత్రం రాజాశ్రితులైన కొద్దిమందికి మాత్రమే తెలుసు," అన్నాడు.

రాజు చిరునవ్వు నవ్వి, "అలాంటి వాళ్ళల్లో నువ్వు కూడా ఒకడివన్నమాట!" అన్నాడు.



''అవును, మహారాజా! ఈ పండితుణ్ణని వచ్చిన శోధకుడు కూడా, ఆ సంగతి ఎరిగినవాడని, నా నమ్మకం. వాళ్ళ రాజు గురించీ, రాజ్యం గురించీ మీరన్న ప్రతి దానినీ, అతడు ధృవపరుస్తూ, ఒక కట్టు కథ అల్లేస్తున్నాడు,'' అన్నాడు విదూషకుడు.

''ఆ విధంగా నా నుంచి ఏదైనా బహుమానం పొందాలని, ఈ వత్సదేశపు పండితుడి ఎత్తుగడ! అదేనా నువ్వు, నాకు చెప్పదలచింది?'' అన్నాడు రాజు.

''ఆ ఎత్తుగడ పారింది కూడా, మహారాజా! అయితే, నేనద్దుకున్నాను. వత్స రాజును విమర్శిస్తూ మాట్లాడడం, మీ మనస్సుకు ఆనందం కలిగించింది. ఈ విధంగానే మిమ్మల్ని అవహేళన చేస్తూ మాట్లాడిన వాళ్ళకు వత్సరాజు బహుమానాలివ్వవచ్చు. కట్టుకథల పుట్టుకకూ, వ్యాప్తికీ, మనుషుల ఈ వింత మానసిక ప్రవర్తనే కారణం,'' అన్నాడు విదూషకుడు.

రాజు కొంచెంసేపు ఆలోచించి, ''సరే, నువ్వు ఇప్పుడు చెప్పిందే ఒక కట్టుకథ కావచ్చు; పరీక్షిద్దాం,'' అని భటుణ్ణి పిలిచి, పండితుణ్ణి తన వద్దకు తీసుకు రమ్మన్నాడు.

భటుడు పొదరింటి దగ్గిరకు వెళ్ళి, శోధకుడు అక్కడ కనబడకపోవడంతో, తిరిగి వచ్చి, ఆ సంగతి రాజుకు చెప్పాడు.

ఈ జరిగిన దానికి ఆశ్చర్యపోతున్న రాజుతో, విదూషకుడు, ''వత్సదేశపు ఆస్థాన పండితుడైన, నా బంధువు ఒకాయన రాత్రి వచ్చాడని చెప్పాగదా? ఆ మాట నిజం అనుకుని, ఈ శోధకుడు చల్లగా జారుకుని వుంటాడు. విలువైన తమ హారం, ఆ పండితుడి పాలు కాకుండా, నేను కాపాడాను,'' అన్నాడు నవ్వుతూ.

''అయితే, ఈ హారం నీదే!'' అంటూ రాజు, మెడ నుంచి హారం తీసి విదూషకుడి కిచ్చాడు.





# శివలీలలు

శబరులు వెళ్లిపోగానే, "పాపం, శివుడు ఎంతకాలంగా పస్తులుంటున్నాడో?" అనుకుని తిన్నడు విల్లు భుజాన పెట్టుకుని వెళ్ళి, అడవి పందిని చంపి, మాంసం ముక్కలు కాల్చి, సువర్ణముఖిలో నీరు తెచ్చి, అంతా శివుడి ముందు పెట్టి, "ఆరగించు!" అన్నాడు.

దానికి శివుడు వెంటనే జవాబియ్యలేదు. కొంతసేపయ్యాక, "నువు తినకపోతే నీ పాదాల దగ్గిరే ప్రాణాలు విడుస్తాను," అంటూ తిన్నడు ఏడవటం మొదలు పెట్టాడు.

శివుడు అతని భక్తికి మెచ్చి, "లే, బాబూ! అలాగే తింటాను," అని తిన్నడు పెట్టినదంతా తినేశాడు.

ఇలా కొంతకాలం గడిచింది. ఒకనాడు శైవుడైన బ్రాహ్మణుడొకడు శివగోచరుడనే వాడు ఆ గుడికి వచ్చి, "ఈ ఎంగిలిపుల్లలేమిటి? స్వామీ, నీ ఆలయాన్ని ఇలా ఎవరు మైలపరిచారు? చెప్పకపోయావో, తిండి మాని ప్రాణాలు విడుస్తాను," అన్నాడు.

"కంగారుపడకు. ఒక ఆటవికుడు తన ధోరణిలో నన్ను మహా భక్తితో కొలుస్తున్నాడు. వాడి పూజను నేను స్వీకరిస్తున్నాను. వాడి భక్తి చూడగోరినట్టయితే నా వెనకపక్క కనపడకుండా దాక్కో!" అని శివుడు పలికాడు.

అంతలోనే తిన్నడు గుడికి వచ్చి, లింగం ముందున్న ఎంగిలి కాలితో ఒక

4. వీరసంగమయ్య వివాహం



పక్కకు తోసి, నీళ్ళు పుక్కిలించి లింగం మీద అభిషేకించి, పత్రిపెట్టి, తినమని మాంసం ముక్కలు శివుడి ముందు పెట్టాడు.

శివుడు తిన్నడి భక్తిని పరీక్షించాలని, వాడు పెట్టిన ఆహారం తినక, మూసిన కంటి నుంచి నీరు కార్చనారంభించాడు. అది చూసి తిన్నడు అందోళనపడి కంటికి చికిత్సలు చెయ్యసాగాడు. వాడు తనకు తెలిసిన చికిత్సలూ, విన్నవీ ఎన్నో చేశాడు. అవేవీ పని చెయ్యకపోగా, శివుడి కంటినుంచి నెత్తురు కారసాగింది.

ఏం చెయ్యటానికీ పాలుబోక తిన్నడు, 'కంటికి కన్నే మందు!' అనుకుని, తన కన్ను ఒకటి తీసి, శివుడికి కన్నుగా అమర్చాడు.

వెంటనే శివుడి రెండో కంటి నుంచి రక్తం కారసాగింది.

"భయం లేదు. దానికి కూడా చికిత్స నా దగ్గిర ఉన్నది," అంటూ తిన్నడు తన రెండో కన్ను పెకలించబోతూండగా శివుడు, "ఆగు! ఆగు!" అంటూ తిన్నడి చెయ్యి పట్టుకుని, వాడి ఎదట ప్రత్యక్షమయాడు.

ఆయన బ్రాహ్మడితో, "శివగోచరా! చూశావు గదా ఈ పామరుడి భక్తి! నీకు నచ్చింది కద!" అని ఆ బ్రాహ్మణుణ్ణీ, తిన్నడినీ ఎదురుగా పెట్టుకుని, "మీకేం వరం కావాలి?" అని అడిగాడు.

"మీకు తోచిన వరం ఇవ్వండి. మేమా అడిగేవాళ్ళం?" అంటూ ఇద్దరూ శివుడి ముందు సాష్టాంగపడ్డారు.

శివుడు వారి భక్తికి మెచ్చి, వారిని తిరిగి ప్రాపంచిక విషయాలలో పడనివ్వక, ఇద్దరినీ తనలో చేర్చుకున్నాడు.

వీరసంగమయ్య అనే అందమైన యువకుడు ఉండేవాడు. అతడు శివభక్తుడు. శివుణ్ణి శరభసాళవ రూపంలో ఆరాధిస్తూ ఉండేవాడు.

అతనికి పెళ్ళి చేసే ప్రయత్నంలో ఉన్న అతని పెత్తండ్రి ఓంకారపురం

వెళ్ళాడు. అక్కడ ఆయన బావమరిది ఒకాయన ఉన్నాడు. ఈ బంధువు చాలా ధనవంతుడూ, శివభక్తుడూనూ. బావ మరుదు లిద్దరూ ఒకరినొకరు చూసుకుని పరమానందం చెంది, కౌగలించుకున్నారు. అతిథికి భోజనాదికాలు ముగించి, గృహస్థు అతనితో, "బావా, ఏం పని మీద ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"శుభకార్యం నిమిత్తమే వచ్చాను. మన వీరసంగమయ్యకు పెళ్ళి ఈడు వచ్చింది. తగిన పిల్ల కోసం చూస్తూ మీ ఓంకారపురం వచ్చాను. నాకు చూడగా, నీ కూతురు చంద్రిణీదేవి వీర సంగమయ్యకు తగిన భార్య అనిపిస్తున్నది. మీకేమీ అభ్యంతరం లేకపోతే ఇద్దరికీ ముడి పెట్టెయ్యవచ్చు." అన్నాడు అతిథి.

గృహస్థు పరమానందభరితుడై, "అదేం మాట, బావా? వీరసంగయ్యకన్న మంచి వరుడు ఎక్కడ దొరుకుతాడు? నువే ముహూర్తం నిర్ణయించి, ఉభయ పక్షాల బాధ్యతా మీద వేసుకుని వివాహం జరిపించు," అన్నాడు.

అప్పటికప్పుడే వివాహ ముహూర్తం ఏర్పాటయింది.

ఓంకారపుర రాజు భాస్కరుడు ఒక నాడు వాహ్యాళి నుంచి తన ఇంటికి తిరిగి



వస్తూ, తమ ఇంటివాకిట నిలబడి ఉన్న చంద్రిణీదేవిని చూసి, ఆమె అందానికి మోహపరవశుడై ఆగి, ఆమెకేసి తేరిపార చూడసాగాడు. ఆ సంగతి గమనించి చంద్రిణీదేవి చప్పున లోపలికి వెళ్ళింది.

రాజు ఆమెను గురించే ఆలోచిస్తూ తన ఇంటికి పోయి, మంత్రులను పిలిచి, ఫలాని పిల్లను తనకు పెళ్లి చెయ్యమని చెప్పాడు. భాస్కరుడి మంత్రులు చంద్రిణీదేవి ఇంటికి వచ్చి, ఆమె తండ్రితో, "ఏమయ్యా నీ అదృష్టం! నీ కుమార్తెను రాజుగారికిచ్చి చెయ్యి. ఆమెకు రాణి అయే యోగం పట్టింది," అన్నారు.



దానికి ఆయన, "నిజమే. మా అమ్మాయికి రాజుగారు భర్తగా కావటం కన్న మహా భాగ్యం ఏమున్నది? కాని వ్యవహారం చెయ్యి దాటిపోయింది. పిల్లను ఒకరికి ప్రదానం చేసేశాను," అన్నాడు వినయంగా.

మంత్రులు వెళ్ళి రాజుతో ఈ మాట చెప్పారు. రాజు తన ఆప్తులనూ, మిత్రులనూ పిలిచి, "మీరు ఎలాగైనా చంద్రిణీదేవిని నాకు భార్యగా చెయ్యకపోతే నా ప్రాణాలు పోతాయి," అన్నాడు.

వాళ్ళు రాజు తరఫున చంద్రిణీదేవి తండ్రి వద్దకు వచ్చి, "ఎంత వెర్రివాడవయ్యా? అదృష్టం తన్నుకు వస్తుంటే అడ్డు పెడతావేమిటి? రాజుగారు తానై నీ కూతురిని చేసుకుంటాననటమేమిటి, నువు కాదనటమేమిటి! పిల్లను రాజుగారికిచ్చి పెళ్ళి చేసెయ్యి," అన్నారు.

దానికి ఆయన, "రాజుగారు అల్లుడు కావటం ఎంతటి మహాభాగ్యమో నాకు మీరు చెప్పాలా? కాని భోగభాగ్యాలకు ఆశపడి నేను మాట తప్పితే మీరే నన్ను నిందించరా?" అన్నాడు.

వాళ్ళు రాజు వద్దకు వెళ్ళి, "మీరు ఈ పిల్లను మరిచిపొండి. అందమైన కన్యలకు లోటా? ఆమె తండ్రి ప్రవర్తన నిజంగా ప్రశంసనీయం!" అని చెప్పారు.

వాళ్ళను పంపేసి రాజు తానే ఒంటరిగా బయలుదేరి చంద్రిణీదేవి ఇంటికి వచ్చాడు.

రాజు వస్తూ ఉండటం చూసి చంద్రిణీదేవి తల్లిదండ్రులు బెదిరిపోయారు. చంద్రిణీదేవి వారితో భయపడనవసరం లేదని చెప్పి, ఒంటరిగా ఎదురు వెళ్ళి, "అన్నగారికి నా మీద ఏమి ఇలా దయ కలిగింది?" అంటూ రాజును ఆహ్వానించింది.

"నిన్ను కోరి వచ్చినవాణ్ణి అలా సంబోధించటం అన్యాయం కాదా? నన్ను కోరి వచ్చే స్త్రీలు ఎందరో ఉండగా నాకు నీ మీద మనసు కలిగింది. నిన్ను చూసిన



క్షణం నుంచీ నేను విపరీతమైన విరహ తాపం పొందుతూ, మరొకతెకేసి చూడ లేకుండా ఉన్నాను. నిన్ను మహారాణిని చేసి, మిగిలిన రాణులందరితోబాటు నేను కూడా నీ సేవ చేస్తాను," అన్నాడు రాజు.

"రాజా, నన్ను వీరసంగమయ్యకు మాట ఇచ్చిన క్షణం నుంచీ అతనినే భర్తగా ఎంచుకుంటున్నాను. ఆడదానికి ఇద్దరు భర్తలు ఎలా సాధ్యపడతారు?" అన్నది చంద్రిణీదేవి.

"నీకోసం తపించి పోతున్నవాడికి ఈ ధర్మపన్నాలు ఎందుకు చెబుతున్నావు?" అని రాజు ఆమెను అడిగాడు.

తాను తన పట్టు వదిలినట్టు కనబడక పోతే రాజు ఏమైనా చెయ్యగలడని గ్రహించి, శివుడిపైనే భారం వేసి, చంద్రిణీదేవి రాజుతో, "నేను మీకు భార్య కావటమే ఈశ్వరాదేశం అయితే అలాగే కానియ్యండి. పెళ్ళికి ముందు వారం రోజులు నిష్ఠతో ఈశ్వరారాధన చెయ్యటం మా వంశాచారం. ఇవాళే వ్రతం ప్రారంభిస్తాను," అన్నది.

రాజు సంతోషంతో వెళ్ళిపోయాడు.

చంద్రిణీదేవి తనకూ, రాజుకూ మధ్య జరిగినదంతా తల్లిదండ్రులకు చెప్పింది. వాళ్ళు ఈ విషయమంతా తెలుపుతూ వీరసంగమయ్యకు లేఖ రాశారు. అతను పెద్దల అనుమతితో వచ్చి, రహస్యంగా చంద్రిణీదేవిని పెళ్ళాడి, గుర్రం మీద తన భార్యతో సహా తన ఊరికి బయలు దేరాడు.

ఈ వార్త చారులవల్ల రాజుకు తెలిసింది. చంద్రిణీదేవి తనను మోసం చేసినందుకు అతను మండిపడి, తన సైనికులను పిలిచి, "మీరు వెళ్ళి, వీరసంగమయ్యను చంపి, చంద్రిణీదేవిని తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

ముందుగా బయలుదేరిన సైనికులు వస్తూ ఉండటం చూసి సంగమయ్య, ఒంటరిగా తాను సైనికులను ఏమీ చేయ

లేదు. గనక, తన ఇష్టదైవమైన శరభావ తారుణ్ణి ధ్యానించాడు.

వెంటనే శరభసాళవ భయంకరాకారం ప్రత్యక్షమై, అగ్నేయాస్త్రంలాంటి ఆయుధాన్ని వీరసంగమయ్యకిచ్చి, "దీనితో శత్రువులను పరిమార్చు," అని చెప్పి అంతర్థానమయింది.

వీరసంగమయ్య తన చేతిలో కత్తి ఉండటం చూసి మహానందం చెంది, దానితో సైనికులను ఎదుర్కొని, ఎడాపెడా వధ చెయ్యనారంభించాడు. ఇదంతా గుట్ట మీద నిలబడి చూస్తూ రాజు నిర్ఘాంతపోయాడు.

ఇంతలో వీరసంగమయ్య తన కరవాలాన్ని ఒక శివభక్తుడిపై విసరబోయి, అతన్ని గుర్తించి, తల వంచి నమస్కారం చేశాడు. ఇది గమనించిన రాజు, వీరసంగమయ్య శివభక్తిని ఆధారం చేసుకుని అతన్ని చంపే ఉద్దేశంతో తాను కూడా వెంటనే శివభక్తుడి వేషం వేసుకుని, వేగంగా కొండ దిగి వీరసంగమయ్యను చేరి, అతను తలవంచి నమస్కరించగానే మెడ మీద తన కత్తితో దెబ్బ వేశాడు. ఆ కత్తి పూలహారమై వీరసంగమయ్య మెడలో పడింది.

ఆ క్షణంలోనే శివుడు వృషభవాహనం మీద ప్రత్యక్షమై, వీరసంగమయ్యను వరం కోరమన్నాడు. తనకూ, తన భార్యకూ, రాజుకూ, పెళ్ళివారికీ శివసాయుజ్యం ఇప్పించమన్నాడు వీరసంగమయ్య భక్తితో నమస్కరిస్తూ.

"నీకు అపకారం చెయ్యదలచిన ఈ పాపిష్ఠి రాజుకు శివసాయుజ్యం ఇయ్యమంటావా?" అని శివుడు వీరసంగమయ్యను అడిగాడు.

"మహాదేవా, ఈ రాజు శైవచిహ్నాలు ధరించి నిన్ను కళ్ళారా చూశాడు. ఇంకా ఇతనిలో పాపాలు ఎక్కడివి?" అన్నాడు వీరసంగమయ్య.

శివుడు ఎంతగానో సంతోషించి, అందరినీ తన వెంట కైలాసానికి తీసుకుపోయాడు. —(ఐపోయింది)



# చురుకైన పనివాడు

ఒక భూస్వామి దగ్గిర, వీరయ్యా అనేవాడు తోటమాలిగా వుండేవాడు. వాడికి వయసుపైబడు తున్న కారణంగా, క్రమంగా ఓపిక తగ్గిపోసాగింది. వాడు పనిమాని ఇంటిపట్టున వుండదలచి, ఆ సంగతి యజమానికి చెప్పాడు.

భూస్వామి అందుకు సరే అని, "నీ స్థానంలో సోమరితనం లేకుండా, కష్టించి పనిచేసే చురుకైనవాణ్ణొకణ్ణి చూడు," అని చెప్పాడు.

ఈ సంగతి తెలిసి ముగ్గురు వచ్చారు. ఆ సమయంలో వీధి వాకిలి దగ్గిర వీరయ్యా, భూస్వామితో ఏదో మాట్లాడుతున్నాడు.

ఆ ముగ్గురూ వచ్చిన పని చెప్పగానే, వీరయ్యా వాళ్ళతో, "సరే, మీలో ఎవరో ఒకరు, వీధి వాకిలికి ఎదురుగా వున్న, ఈ బండరాయిని తీసి దూరంగా పారవేసిరండి," అన్నాడు.

వచ్చినవాళ్ళలో ఇద్దరు, ఆ రాయికేసి చూసి, "ఇంత పెద్ద రాయిని కదిలించాలంటే ఎంత శ్రమ! ఇది మావల్ల కాదు," అని వెళ్ళిపోయారు.

మూడవవాడు మాత్రం వీరయ్యాతో, "ఈ బండరాయిని ఇక్కడి నుంచి కదిలించి, వీధివారగా నెట్టేస్తాను. ఒక గునపం ఇప్పించండి," అని రాయికేసి పరీక్షగా చూస్తూ, "అసలిది వీధివాకిలి ముందుకు ఎలా వచ్చింది!" అంటూ కాలితో నెట్టి చూశాడు.

బండరాయి అడుగు దూరం జరిగిపోయింది. అది నిజంగా బండరాయి కాదు. ఎండు గడ్డిని గోతాంలో పెట్టి మూతి బిగించి, రాయిలా కనబడేందుకు వీరయ్యా దానికి మట్టి పులిమాడు.

వీరయ్యా, యజమానితో, "ఇతనిలో కష్టించి పనిచేసే లక్షణంతోపాటు, మంచి చురుకు తనం కూడా వున్నది. మీకు తోటమాలిగా పనికి వస్తాడు," అని చెప్పాడు.

భూస్వామి వాణ్ణి తోటమాలిగా నియమించుకున్నాడు.

—ఎస్. అనంత





# లౌక్యుడు

శంకరయ్య అనే గ్రామస్థు డొకాయన, పని వుండి పొరుగుగ్రామం వెళ్ళి, రాత్రి తిరిగి వచ్చేటప్పుడు పొలం గట్ల మీద నడుస్తూ, కాలు జారి పక్కనే వున్న ఊబిలోకి కూరుకుపోయాడు. ఆయన బయటపడాలని ప్రయత్నించిన కొద్దీ, ఇంకా లోతుకు దిగబడిపోసాగాడు. ఇక లాభం లేదని బయటపడే ఆశవదులుకుని, ఆ రాత్రంతా ఊబిలోనే కదలకుండా అలాగే వుండిపోయాడు.

తెలతెలవారుతూండగా, ఆ మసక చీకట్లో దూరాన్నుంచి ఎవరో తన కేసి వస్తూండడం గమనించాడు, శంకరయ్య. ఆ వచ్చేవాడు తనను చూసి ఏదో భూతం అని పారిపోకముందే, త్వరగా రమ్మని గట్టిగా కేక వేసి పిలిచాడు. అతను దగ్గిరకు రాగానే, తన పరిస్థితి చెప్పి పైకి లాగమన్నాడు.

వాడు నానాతంటాలుపడి, అతికష్టం మీద శంకరయ్య భారీశరీరాన్ని పైకి లాగి, ఆ ప్రయత్నంలో కాలిపట్టు తప్పి, తను ఊబిలో పడిపోయాడు. శంకరయ్య జరిగినదానికి నొచ్చుకుంటూ వాణ్ణి పైకి లాగి నిలబెట్టాడు.

ఆ చుట్టుపక్కల ఎక్కడా నీరు లేక పోవడంతో, ఇక చేసేదిలేక ఇద్దరూ బురద కొట్టుకున్న దుస్తులతో గ్రామం కేసి బయలుదేరారు. మాటల సందర్భంలో, ఆ వ్యక్తి పేరు శేఖరుడనీ, దూరగ్రామం నుంచి వస్తున్నాడనీ, శంకరయ్య తెలుసుకున్నాడు.

"మా ఊళ్ళో, నీకేం పని?" అని అడిగాడు శంకరయ్య.

"మీ గ్రామంలో శంకరయ్యగారనే పెద్దమనిషితో పని పడివస్తున్నాను," అన్నాడు శేఖరుడు.

దాసరి వెంకటరమణ



ఆ జవాబుకు శంకరయ్య ఆశ్చర్యపోయి, "ఆయనతో ఏం పని?" అని అడిగాడు.

"అది తమకు చెప్పేదికాదులెండి!" అంటూ శేఖరుడు తన నడుమువరకూ అంటుకున్న బురదకేసి చూసుకుని, "దీన్ని వదిలించుకునే మార్గం చెప్పి, గ్రామంలో కాస్త ఆ శంకరయ్య గారిల్లెక్కడో చూపించండి," అన్నాడు.

శంకరయ్య జవాబేమీ ఇవ్వకుండా వూరుకున్నాడు.

వాళ్ళు గ్రామం చేరేసరికి జాము పొద్దెక్కింది. బురద కొట్టుకున్న దుస్తుల్లో వున్న వాళ్ళిద్దర్నీ, గ్రామస్థులు వింతగా చూడసాగారు. ఆ సమయంలో అటుగా వెళుతున్న షావుకారు చిన్నయ్య, శంకరయ్యను, "ఈ అవతారం ఏమిటి?" అని అడిగాడు.

శంకరయ్య అతడికి శేఖరుణ్ణి చూపుతూ, "నేను పొరుగూరునుంచి తిరిగివస్తున్నాను. ఆయన పాపం, ఒక పొలం గట్టు పక్కన ఉన్న ఊబిలో కూరుకుపోయి కనిపించాడు. బయటికి లాగే ప్రయత్నంలో, నేను కాలుజారి ఊబిలో పడ్డాను," అంటూ బిగ్గరగా నవ్వాడు.

చిన్నయ్య కూడా నవ్వుతూ వెళ్ళిపోయాడు.

రెండు సందుమలుపులు తిరిగేసరికి, ఒకముసలాయనఎదురుపడిశంకరయ్యను షావుకారు చిన్నయ్య అడిగిన ప్రశ్నే అడిగాడు.

దానికి శంకరయ్య చిరునవ్వు నవ్వుతూ, "రాత్రి పొరుగూరు నుంచి వస్తూ, ఊబిలో పడ్డాను. ఈయనెవరో దేవుడిలావచ్చి, నన్ను రక్షించాడు," అన్నాడు.

ఆ సందుమలుపు తిరుగుతూండగా, మరొకతను శంకరయ్యను, మొదటి ఇద్దరు అడిగినట్టే అడిగాడు.

"వేకువజామున పొరుగూరు నుంచి వస్తూంటే, పాపం, ఎవరిదో ఎడ్లబండి

ఊబిలో దిగబడి వుండడం కనిపించింది. ఈయనా, నేనూ కలిసి బండివాళ్ళకు సాయం చేశాం. అందువల్లనే, మా అవతారాలు ఇలా తయారయినై," అన్నాడు శంకరయ్య.

శేఖరుడికి, శంకరయ్య ప్రవర్తన అర్థం కాలేదు. అతను, శంకరయ్యను, "అయ్యా, నాదొక అనుమానం. మీరు అడిగిన ప్రతి ఒక్కరికీ, ఒక్కొక్క రకంగా కారణం చెబుతున్నారు. ఎందువల్ల?" అని అడిగాడు.

"నీకు శంకరయ్యతో పనేమిటో చెప్పనప్పుడు, నేను మాత్రం, నీవడిగినదానికి జవాబెందుకు చెప్పాలి?" అన్నాడు శంకరయ్య.

"మీరు ముందు నా సందేహం తీర్చండి. తర్వాత, నేను ఈ గ్రామం వచ్చిన పని చెబుతాను," అన్నాడు శేఖరుడు.

శంకరయ్య అందుకు సరేనన్నట్టు తలవూపి, "ఈ గ్రామంలో ఎక్కువ పొలం, పలుకుబడీ, పరపతీ వున్న పెద్ద మనుషుల్లో, నేనొకణ్ణి. అలాంటి నేను ఊబిలో కూరుకుపోయి, రాత్రంతా చలిలో అవస్థపాలైనానంటే, ఎంత పరువు తక్కువ! ఈ విషయం తెలిస్తే, అందరూ చాటుమాటున, నా గురించి నవ్వుకోరా?" అన్నాడు.

"అలా అంటారేం! ఏ క్షణాన ఏ మనిషికేం జరుగుతుందో చెప్పలేంగదా," అన్నాడు శేఖరుడు.



"ఆ మాట నిజమే. ఇది మారుతూన్న కాలం. నువ్వు చెప్పిన విషయం గురించి ఎవరూ ఆలోచించరు," అన్నాడు శంకరయ్య.

"మరి అయితే, ఒక ముసలాయనకు నిజం చెప్పారు. కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు శేఖరుడు.

ఆ ప్రశ్నకు శంకరయ్య పెద్దగా నవ్వి, "ఆ ముసలాయన ఇటువంటి స్వల్ప విషయాలను పట్టించుకునే రకం మనిషి కాదు. ఎవరు ఏ గంగలో దూకినా, దూకక పోయినా, నాకు ఒరిగేదేంలేదనుకుంటాడు. అతడికి నిజం చెప్పినందువల్ల, నాకు వచ్చే నష్టం ఏమీలేదు. మిగతా వాళ్ళందరికీ, వారి, వారి మనస్తత్వాలకు సరిపడేలా చెప్పాను," అన్నాడు.

"అంటే, ప్రతి చిన్న విషయం గురించీ మీరింత లౌక్యం ప్రదర్శిస్తారన్నమాట!" అంటూ శేఖరుడు ఆశ్చర్యపోయాడు.

"ఇంతకూ, శంకరయ్యతో ఏం పనో చెప్పావుకాదే?" అన్నాడు శంకరయ్య.

అందుకు శేఖరుడు, "నాకు లౌక్యం బొత్తిగా తెలీదండి. ఎవరితో ఎలా మాట్లాడాలో చేతకాదు. ఈ విషయంలో శంకరయ్యగారి సలహా విందామని వచ్చాను. వారి గురించి వినడం తప్ప, ముఖ పరిచయం లేదు," అంటూ కొంచెం ఆగి, "అయ్యా, కొంపదీసి శంకరయ్యగారు తమరు కాదుకదా?" అని అడిగాడు.

"కాదు! కాని, శంకరయ్యా, నేనూ మంచి స్నేహితులం," అన్నాడు శంకరయ్య.

"అలాగాండి! సరే, ఆయనతో ఇప్పుడికే అవసరం లేదండి. నేనొచ్చిన పని అయిపోయింది, వెళతాను," అంటూ శేఖరుడు వెనుదిరిగాడు.

"అదేమిటి? మా ఇంటికొచ్చి స్నానం చేసి బట్టలు మార్చుకుని వెళ్ళండి," అన్నాడు శంకరయ్య.

"వద్దండి! ఇదే అవతారంతో, నేను మా గ్రామం వెళ్ళాలి," అంటూ శేఖరుడు చకచక వెళ్ళిపోయాడు.





# పులిమీద పుట్ర

పూర్వం చీనాదేశంలో ఒక మహావీరు డుండేవాడు. అతడు బలహీనులను బలవంతులైన దుర్మార్గుల బారినుండి రక్షిస్తూండేవాడు.

ఒకనాడీ వీరయోధుడు తన ఖడ్గాన్నీ, ధనుర్బాణాలనూ పట్టుకుని తన గుర్రాన్ని ఎక్కి రాజధాని నగరానికి బయలుదేరి కొన్నాళ్ళు ప్రయాణించినాక, ఒకనాడు దారి తప్పటం జరిగింది. చీకటి పడబో తున్నదిగాని మజిలీస్థలం కనిపించలేదు. అందుచేత మన యోధుడు ఒక గ్రామం చేరి ఆ రాత్రి అక్కడ ఉండిపోదామను కున్నాడు.

ఆ గ్రామంలో ఒక ఇంటి ప్రాకార ద్వారం తెరిచి ఉన్నది. లోపల ఇంట్లో నుంచి దీపం వెలుగు కనిపిస్తున్నది. అందుచేత మన యోధుడు ఆ ఇంటి ముందు గుర్రం ఆపి, దిగి, దాన్ని నడిపించుకుంటూ ఇంటి ముందున్న ఆవరణలోకి ప్రవేశించాడు. ఒక వృద్ధురాలు ఇంటిమధ్య కూచుని, వడుకు తున్నది. గుర్రపు డెక్కల చప్పుడు వింటూనే ఆమె లేచివచ్చి మన యోధుణ్ణి ఏం పని అని అడిగింది.

"అమ్మా, నేను దారి తప్పాను. ఈ రాత్రి పడుకునేటందుకు మీ ఇంట్లో కాస్త చోటు ఇప్పించగలరా?" అన్నాడు యోధుడు.

"చోటు ఇవ్వటమూ, ఇవ్వకపోవటమూ నా చేతిలో లేదు, నాయనా!" అన్నది వృద్ధురాలు విచారంగా.

"ఇంటికైన మగవాళ్ళు ఏరీ? మీరు ఒంటరిగా ఉన్నారేం?" అని యోధుడు ఆమెను అడిగాడు.

"నేను విధవరాలిని, నాయనా. నాకున్న ఒక్క కొడుకూ ఎప్పుడూ



వ్యాపారం మీద తిరుగుతూ వుంటాడు,'' అన్నది వృద్ధురాలు.

''మరి మీ కోడలు ఏదీ?'' అన్నాడు యోధుడు.

''ఎందుకు అడుగుతావు, నాయనా, అది పొరపాటున ఆడపుటక పుట్టిందిగాని, దానికి ఎంతలేసి మగవాళ్ళూ సమం కారు. మనిషి జమాజెట్టీలాగుంటుంది, వట్టి కోపిష్టిది. అయినదానికీ కానిదానికీ మండిపడుతుంది. తలుచుకుంటే అది నన్ను చిటికెనవేలుతో చంపెయ్యగలదు. అందుకని ఎంతో అణిగి మణిగి అతి జాగ్రత్తగా ఉంటాను. అయినా, అది నన్ను అడుగడుగునా కసురుతూనే ఉంటుంది. అందుకే నేను నీ కోరిక తీర్చలేని స్థితిలో ఉన్నానని చెప్పాను, నాయనా!'' అన్నది వృద్ధురాలు.

ఇదంతా వినేసరికి యోధుడికి మండిపోయింది.

''ఎంత విడ్డూరం! ఎంత అన్యాయం! ఈ గయ్యాళి మనిషి ఎక్కడ? నీకు ఆ మనిషి పీడ లేకుండా విరగడ చేస్తాను,'' అన్నాడు యోధుడు.

అనాథ అయిన ఈ వృద్ధురాలిని రక్షించటానికి అతనికి మంచి అవకాశం దొరికింది. అతను తన గుర్రాన్ని ఒక బండరాయికి కట్టేసి కత్తి దూసి నిలబడ్డాడు.

''ఊరుకో, నాయనా! ఇది నీకు సాధ్యమయే పని కాదు. మా కోడలి సంగతి నువ్వెరగవు. దానికి ఆడపను లేవీ చేతగావు, కానీ రోజూ అది అడివికి వెళ్ళి కర్రపుల్ల కూడా సాయం లేకుండా ఏదో ఒక జంతువును ఉత్త చేతులతో చంపి తెస్తుంది. వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో మేము కాలక్షేపం చెయ్యగలుగుతున్నాము. అందుకే నేను దానికి కోపం తెప్పించటానికి వెరుస్తాను,'' అన్నది వృద్ధురాలు.

వృద్ధురాలు ఈ మాట అనగానే మన యోధుడు కత్తిని మళ్ళీ ఒరలో పెట్టేశాడు.

"నా జీవితమంతా అనాధలను దుర్మార్గుల బారి నుంచి రక్షించటానికి కంకణం కట్టుకున్నాను. నీ కోడలు పైన నీ బతుకు ఆధారపడి ఉందంటున్నావు గనుక నేనామెను చంపను! మెత్తగా తన్ని బుద్ధి వచ్చేలాగ చేస్తాను!" అన్నాడు యోధుడు.

మరి కొంచెం సేపటిలో కోడలు రానే వచ్చింది. ఆమె తన వీపుపై నుంచి ఒక పెద్ద పులిని ఆవరణలో పడేసి, "ముసలి దానా, దీపం తెచ్చి, దీన్ని లోపలికి తీసుకుపో!" అని కేక పెట్టింది.



ముసలిది దీపం తెచ్చి దాని వెలుతురులో పులిని చూసి బెదిరింది. మన యోధుడి గుండె కూడా ఆ చచ్చిన పులి కనబడగానే, చప్పున చల్లబడింది.

"ఆ గుర్రం ఎక్కణ్ణుంచి వచ్చింది?" అని కోడలు అత్తను అడిగింది.

మన యోధుడు ముందుకు వచ్చి, "ఆ గుర్రం నాదేనండి. నేను రాజధానికి ప్రయాణమైపోతూ, దారి తప్పానండి. మీ గ్రామం చేరేసరికి చీకటిపడిందండి. ద్వారం తెరిచి ఉండటం చూసి ఈ రాత్రికి ఇక్కడ పడుకోనిస్తారేమో అడుగుదామని లోపలికి వచ్చానండి," అన్నాడు.

"అతిథి వస్తే మర్యాద చెయ్యక మా అత్త బయటనే నిలబెట్టి ఉంచిందా? బాబూ, ఆవిడ అజ్ఞానాన్ని క్షమించండి. ఇవాళ ఈ పులిని చంపి తీసుకువచ్చేసరికి కాస్త పొద్దుపోయింది. మీకు తగిన మర్యాద జరగలేదనే నాకు చింతగా ఉన్నది," అన్నది కోడలు.

"అలా ఒక్కనాటికీ అనుకోకండి!" అన్నాడు మన యోధుడు. చూడగా ఈ కోడలు మంచి మానమర్యాదలు గలదిగా అతనికి కనబడింది. ఆమె త్వరలోనే అతనికి పులి మాంసమూ, ఇతర కూరలూ వడ్డించి మంచి భోజనం పెట్టింది. ఆమె అతి మర్యాదగా, "మా పేద భోజనం చూసి ఏమీ అనుకోకండి," అన్నది.

"ఎంతమాట! భోజనం మహా దివ్యంగా ఉంది!" అన్నాడు మన యోధుడు.

భోజనం అయినాక అతను కోడలితో, "చూడు అమ్మాయీ! ఇంత శక్తిమంతు రాలివీ, బుద్ధిమంతురాలివీ అయి ఉండి కూడా నీకు పెద్దల యెడ భక్తి లేకపోవ టానికి కారణమేమిటి?" అన్నాడు.

ఈ మాట వినగానే కోడలు తోక తొక్కిన తాచులాగా అయిపోయి, "ఏమిటీ? ఆ ముసలిముండ ఏం చెప్పిందేం?" అన్నది.

"నువు తొందరపడకు. ఆమె నాతో ఏమీ అనలేదు. కాని, నువు ఎంతో మర్యాదలు తెలిసినదానివైయుండి కూడా నీ అత్తగారిని చూడదగినంత మర్యాదగా చూడడం లేదేమోననిపించి నేనే ఈ ముక్క అడిగాను," అన్నాడు యోధుడు.

ఆమె ఒక చేత దీపం, మరొక చేత మన యోధుణ్ణి పట్టుకుని బయటి ఆవరణ లోకి లాక్కుపోయి, "అలా నిలబడు! నేను నీకో మాట చెప్పాలి!" అన్నది.

ఆమె ఒక బండరాయి మీద చతికిల బడి రాతిని చూపుడువేలుతో గోరుతూ, "ఫలానిరోజు ఈ విధంగా జరిగింది! ఇంకో రోజు ఈ విధంగా జరిగింది. మరో రోజు ఈ విధంగా జరిగింది. చెప్పు! తప్పు అవిడదా, నాదా?" అన్నది. ఆమె ఆ రాతిని మూడుసార్లు గోరింది. మూడు సార్లూ రాతి మీద మూడు గాట్లు పడ్డాయి.

మన యోధుడికి వాటిని చూస్తేనే పై ప్రాణాలు పైన పోయాయి.

"ఇంకా సందేహమెందుకు తల్లీ? మూడుసార్లూ తప్పు మీ అత్తగారిదే!" అన్నాడతను.

"అంతే నాకు కావలసింది!" అంటూ కోడలు లేచి అతను పడుకునేటందుకు వసారాలో మంచం వేసి, తన దారిన తాను వెళ్ళి గదిలో పడుకున్నది.

మన యోధుడికి అనాథరక్షణ చెయ్యా లనే ఆసక్తి పూర్తిగా నశించింది. ఆరోజు తాను ప్రాణాలతో బయటపడినందుకు దేవుడికి వెయ్యి దణ్ణాలు పెట్టుకుని, తెల్ల వారగానే తన గుర్రం మీద ఎక్కి అతను తన దారి పట్టాడు.





# వెర్రిబాగులవాడు

పూర్వం ఒక గ్రామంలో ముగ్గురు అన్నదమ్ము లుండేవారు. వారిలో మూడోవాడు వెర్రిబాగులవాడు. తండ్రి చనిపోయినాక పెద్దవాళ్ళిద్దరూ ఆస్తి పంచుకుని, మూడోవాడికి ఒక పాత పెట్టె మాత్రం ఇచ్చారు.

ఒకనాడు పెద్దవాళ్ళిద్దరూ అమ్మే సరుకులను తీసుకుని సంతకు బయలుదేరి వెళ్ళారు. సంతకు తానుమాత్రం ఎందుకు వెళ్ళగూడ దనుకుని, ఒక ఎద్దు కొమ్ములకు పలుపు కట్టి, పలుపుతాడు చేతబట్టుకుని వెర్రిబాగులవాడు కూడా బయలుదేరాడు.

వాడు అడవిదారిన పోతూవుండగా ఒక ఎండిపోయిన చెట్టు గాలికి కదిలి, కొమ్మల రాపిడికి కిరకిరలాడింది. వెంటనే వెర్రిబాగులవాడు ఆగి, "ఈ ఎద్దును కొంటానంటావా? ఇరవై రూపాయలు అఖరు బేరం! నీకు ఇష్టమైతే కొను. లేకపోతే లేదు. అంతే!" అన్నాడు. చెట్టు మళ్ళీ కిరకిరలాడింది.

"డబ్బు చెల్లించటానికి గడువు కావాలా? రేపు ఇవ్వొచ్చులే. ఇంతలో నీ డబ్బెక్కడికి పోతుంది. ఇదుగో ఎద్దు!" అంటూ వెర్రిబాగులవాడు తాను సంతకు తీసుకుపోతున్న ఎద్దును ఆ ఎండిన చెట్టుకు కట్టేసి, సంతోషంగా ఇంటికి వెళ్ళిపోయాడు.

"ఏంరా, వెర్రివాడా? నీ ఎద్దు కనిపించదేం?" అని అన్నలు అడిగారు.

"ఇరవై రూపాయలకు అమ్మేశాను!" అన్నాడు వెర్రిబాగులవాడు.

అన్నలు ఆశ్చర్యంతో, "అదేమిటి? డబ్బేదీ?" అన్నారు.

"రేపటిదాకా గడువిచ్చాలే!" అన్నాడు వెర్రిబాగులవాడు. అన్నలు వాణ్ణి తిట్టి అంతటితో ఆ విషయం పోనిచ్చారు.




మర్నాడు తెల్లవారుతూనే మూడోవాడు బయలుదేరి అడవిలో ఉన్న మోడు చెట్టు వద్దకు వెళ్ళాడు. చెట్టు గాలికి ఊగుతూ కిరకిరలాడుతున్నది గాని, అక్కడ ఎద్దు లేదు.

వెర్రిబాగులవాడు చెట్టుతో, "అన్న ప్రకారం నా పైకం యిచ్చెయ్యి!" అన్నాడు.

చెట్టు కిరకిరలాడింది.

"రేపా? ఇంకా నయం! ఇవాళంటే సరేగదా అని ఒప్పుకున్నాను. అంతగా అడుగుతున్నావు గనక, పోనీ రేపటిదాకా అగుతాను. రేపు ఇవ్వకపోతే ఎంత మాత్రమూ మర్యాదగా వుండదు. తరవాత నీ యిష్టం!" అని చెట్టుతో చెప్పి వాడు ఇంటికి వచ్చేశాడు.

"నీ డబ్బు తెచ్చుకున్నావా?" అని అన్నలు వాణ్ణి అడిగారు.

"ఇంకా లేదు. రేపటిదాకా అగాలి!" అన్నాడు వాడు.

"ఇంతకూ ఎద్దును ఎవరికి అమ్మావు?" అని వాళ్ళు అడిగారు.

"అడివిలో ఉండే మోడు చెట్టుకు." అని వాడు జవాబిచ్చాడు.

"వెర్రివెధవా!" అని తిట్టారు అన్నలు.

వెర్రిబాగులవాడు మర్నాడు ఉదయమే లేచి, గొడ్డలి భుజాన పెట్టుకుని అడవిలో వుండే చెట్టువద్దకు వెళ్ళాడు.

"నా డబ్బు నాకు కక్కెయ్యి! నీకు అప్పు పెట్టినందుకు మా అన్నలు నన్ను తిట్టారు కూడా!" అన్నాడు వాడు చెట్టుతో.

చెట్టు కిరకిరలాడింది.

"అదేం కుదరదు! ఇంక ఒక్క క్షణం ఆగను. నా డబ్బు నాకివ్వకపోతే నిన్నిప్పుడే పేళ్ళు వేసెయ్యగలను, జాగర్త!" అన్నాడు వెర్రిబాగులవాడు.

చెట్టు కిరకిరలాడింది. వెర్రిబాగులవాడు గొడ్డలి ఎత్తి దాని బోదె మీద కొట్టసాగాడు. అసలే ఎండి, చీకి ఉన్న అ చెట్టు నాలుగు దెబ్బలకల్లా పెళపెళా విరిగి పడింది.

అది అంత సులువుగా విరగటానికి మరొక కారణ మేమిటంటే ఆ చెట్టు బోదెలో తొర్ర ఒకటి ఉంది. అందులో కొందరు దొంగలు తాము దోచిన బంగారం దాచుకున్నారు. చెట్టు విరిగి పడగానే బంగార మంతా వెర్రిబాగులవాడి కళ్ళ బడింది.



ఆ బంగారంలో కొంత తన జేబుల్లో కుక్కుకుని వాడు ఇంటికి పరిగెత్తాడు.

''ఈ బంగార మంతా నీకెక్కడిదిరా?'' అని అన్నలు వాణ్ణి అడిగారు.

''నాలుగు తగిలించేసరికి అడవిలో చెట్టు కక్కింది! ఇంకా చాలా ఉంది. నేను కొంచెమే తెచ్చుకున్నాను!'' అన్నాడు వెర్రిబాగులవాడు.

వాడి అన్నలు వెంటనే వాణ్ణి తీసుకుని అడివికి వెళ్ళి, మిగిలిన బంగారం కూడా తీసుకుని ఇంటిదారి పట్టారు.

''నువు వట్టి వెర్రికుంకవు! మన దగ్గిర ఈ బంగారం ఉన్నట్టు ఎవరికీ తెలియనివ్వకు! తెలిస్తే ప్రమాదం!'' అని వెర్రిబాగులవాడితో అన్నలు చెప్పారు.

''నేనెవరికీ చెప్పను!'' అన్నాడు వాడు.

వారు కొంతదూరం వెళ్ళేసరికి వాళ్ళ ఊరి శాస్తులుగారు ఎదురుపడి, ''ముగ్గురూ గోతాలలో ఏమిటో తెస్తున్నారే! ఏమిటవి?'' అని అడిగాడు.

''దొండకాయలు!'' అని పెద్దవాళ్ళు చెప్పారు. కాని వెర్రిబాగులవాడు వెంటనే, ''శాస్తుల్లుగారిని మోసం చెయ్యవచ్చా? ఇది బంగారం, శాస్తుల్లుగారూ, బంగారం! కావలిస్తే చూడండి!'' అంటూ తన మూట విప్పి చూపాడు.

అంత బంగారం చూడగానే శాస్తుల్లుగారు మతిపోయినట్టయి, మూటలో నుంచి రెండు గుప్పిళ్ళ బంగారం ఒడిసి లాక్కున్నాడు.

''ఆఁ? అదేం పని?'' అంటూ వెర్రిబాగులవాడు తన గొడ్డలితో శాస్తుల్లుగారి నెత్తిన ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బకు ఆయన కాస్తా చచ్చి ఊరుకున్నాడు.

"ఇదేం పనిరా, మూర్ఖుడా! నీ గొంతు మీదికి తెచ్చుకోవటం గాక, మా గొంతు మీదికి కూడా తెచ్చేటట్టున్నావే?" అంటూ పెద్దవాళ్ళిద్దరూ దారికి కొంచెం ఎడంగా ఒక గొయ్యి తవ్వి శవాన్ని పూడ్చేశారు.

కాని ఇదంతా వెర్రిబాగులవాడు చూశాడు గనక ప్రమాదం ఉందని గ్రహించి, పెద్దవాళ్ళిద్దరూ ఆ రాత్రి మళ్ళీ వచ్చి, శవాన్ని పైకి తీసి దూరంగా ఇంకొక చోట పూడ్చి, మొదట శవాన్ని పూడ్చినచోట ఒక చచ్చిన మేకను పూడ్చి పెట్టారు.

కొద్ది రోజులకల్లా శాస్త్రుల్లుగారు కన పడటం లేదని ఊళ్ళో అందోళన బయలు దేరింది. గ్రామస్థులు "శాస్త్రుల్లుగారు ఏమై ఉంటాడో!" అని అనుకోవటం విని వెర్రిబాగులవాడు, "మీకసలు ఏమీ తెలీదు. అయన్ను నేనే గొడ్డలితో తల పగలగొట్టాను. మా అన్నలు పూడ్చేశారు. నా మాట నమ్మకం లేకపోతే నేను చూపిస్తా రండి!" అంటూ, శాస్త్రుల్లుగారిని పూడ్చిపెట్టిన చోటికి గ్రామస్థులను తీసుకు పోయాడు.

"ఇదుగో, ఇక్కడే పూడ్చాం!" అంటూ వాడు పలుగు తీసుకుని గుంట కొంత లోతు తవ్వి గ్రామస్థులతో, "శాస్త్రుల్లు గారికి బొచ్చు ఉండేదేనా?" అన్నాడు.

"ఉండేదే!" అన్నారు గ్రామస్థులు.

"గడ్డం ఉండేదే గదా?" అన్నాడు వెర్రిబాగులవాడు.

"అవును, వుండేదే!" అన్నారు వాళ్ళు.

"నెత్తిన రెండు కొమ్ములుండేవే గదా!" అన్నాడు వెర్రిబాగులవాడు.

"కొమ్ములుండటమేమిటి?" అన్నారు గ్రామస్థులు ఆశ్చర్యంగా.

"నా మాట నమ్మకపోతే మీరే చూసు కోండి!" అంటూ వాడు చచ్చిన మేక తలను పైకెత్తి చూపాడు.

గ్రామస్థులకు వాడి మాటలలో నమ్మకం పోయింది. "ఈ వెర్రిబాగులవాడి మాటల కేంలే? పదండి!" అంటూ వాళ్ళు తమ దారిన వెళ్ళిపోయారు.



## పక్షులు-జంతువులు:



# ప్రాణాంతకం!

పాముకాటువల్ల ప్రపంచం మొత్తం మీద యేటా దాదాపు 4,000 మంది ప్రాణాలు కోల్పోతున్నారు. బర్మాలో ఈ మరణాల సంఖ్య మరీ ఎక్కువగా ఉంటున్నది.

# ఆక్టోపస్ శక్తి!

సముద్ర జలచరమైన ఆక్టొపస్ శరీరంలో దాదాపు 200 సక్కర్స్ ఉన్నాయి. 318 కిలో గ్రాముల బరువును లాగ గల శక్తి వీటికి ఉన్నది.





# పెద్ద జింక

ఏడడుగులా ఎనిమిది అంగుళాల ఎత్తూ, ఎనిమిది వందలా పదహారు కిలో గ్రాముల బరువూ గల అలాస్కా జింక ప్రపంచంలోకెల్లా పెద్ద జింకగా పరిగణించబడుతున్నది. దీని కొమ్ముల పొడవు 78.5 అంగుళాలు.

# మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం సూపర్ రిన్‌తో తళతళలాడే ఆ తెల్లదనం




**సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



K. P. A. Swamy



A. L. Syed

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బాల భక్తుడే తల్లి! రెండవ ఫోటో: ఎగతాళి చేయకే చెల్లి!

పంపినవారు: ఎ. వి. ఎస్. రామలక్ష్మి, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు-2.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Hey kids!
## A special biscuit is coming your way...

# Ampro Candy Bisk

It's new! It's different! It tastes like sugar candy!



### Quiz No. 2 (Cut and keep)

Do you know:
1. *Which role did Charlie Chaplin play most often?*
2. Who was India's first Prime Minister?
3. Who is Richie Rich's girl friend?
4. Which cricketer holds the record for the most runs made in tests?
5. *What other role does Superman play?*

Answers:
1. Role of a tramp 2. Jawaharlal Nehru
3. Gloria 4. Sunil Gavaskar
5. Clark Kent-a newspaper reporter

**Match faces with symbols:**














Answers:
1-3, 2-1, 3-2, 4-5, 5-4




ampro® Candy Bisks

**Delightfully different... deliciously familiar!**

Sista's/AIL/459/86 C

# రాతలో విజేత
# నటరాజ్ పెన్సిల్

నటరాజ్‌తో రాయడంలో మజాయే వేరు. ఇదే, నటరాజ్ పెన్సిలును ఎన్నుకునే వారందరి మనసుల్లోని మాట. అవును మరి. నటరాజ్ ఎంతో చక్కగా రాస్తుంది. నున్నగా, నల్లగా, నన్నగా, ముక్క విరగకుండా. అందుకే నటరాజ్, ఆ రకానికి చెందిన మరే ఇతర పెన్సిలుకన్న ఎక్కువ కాలం మన్నుతుంది, ఝామ్మని రాస్తూ పోతుంది.




**నటరాజ్** పెన్సిల్




అలుపు లేకుండా రాస్తుంది, అధిక కాలం వస్తుంది.

ఉత్కృష్ట ఉత్పాదనల నిర్మాతలు
హిందుస్తాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 001.

everest/85/HP/190-ti